# చిత్రభాను

(కవితా సంకలనం)





స్నేహ సాహితి

వరంగల్లు

2002

ఇది రజతోత్సవ ప్రచురణ

# చిత్రభాను

(కవితా సంకలనం)

సంపాదకత్వం

డా॥ టి. శ్రీరంగస్వామి

యం.ఏ., పి.హెచ్.డి.,

శ్రీలేఖ సాహితి

సాహిత్య, సాంస్కృతిక సంస్థ

(స్థాపితం : 1977 రి.నెం. 2337/89)

ఇ.నెం. 5-11-481, విద్యారణ్యపురి,

హనుమకొండ, వరంగల్లు - 506 009

**1977-2002**

# CHITRABHANU

*(Collection of Free Verse Poetry)*

*Edited by* **Dr. T. SRIRANGA SWAMY,** M.A., Ph.D.

**PUBLICATION No. 37**

**13th APRIL, 2002 (Ugadi)**



**Price Rs. 40/-**

*టైటిల్ : క్రిష్ణ కిషోర్*
*(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికకు కృతజ్ఞతలతో...)*

*For Copies :*

SRILEKHA SAHITHI
H.No. 5-11-481, Vidyaranyapuri
HANAMKONDA - 506 009 Dist. Warangal.

VISALAANDHRA PUBLISHING HOUSE, Hyderabad
and its BRANCHES

*Printed at*

SRI SHANTHI Offset Printers, Hanamkonda. Ph. 579541

# 26వ వసంత సందర్భం...

సమాజము ననుసరించి సంఘటితుడై కవి రచనను వెలువరిస్తుంటే సాహిత్యంలో క్రొత్త క్రొత్త ఉద్యమాలు తలయెత్తుతున్నప్పుడే ఆ ఉద్యమ చైతన్యానికి ప్రాతినిధ్యం వహించే కవులలో ఉద్యమభావజాలానికి నిబద్ధమైనట్లు ఎక్కువమంది కనబడుతుంటారు. ఒక ఉద్యమానికిగానీ, సిద్ధాంతానికిగానీ, వాదానికిగానీ, ధోరణికిగానీ లేదా ఉత్తమ కవితా లక్ష్యానికిగాని కవి నిబద్ధుడైన దానినిబట్టి అతని దర్శనమేమిటో, దానినిబట్టి అతడు ఏమి చెప్తున్నాడో వివేచించటానికి వీలౌతుంది. కవి దర్శనము నుండి పై నాలుగు అంశాలూ సహజంగా పుట్టి వికసిస్తాయి. ప్రక్రియలు దర్శన మూలం కాబట్టి ఏమి చెప్పేదీ, ఎలా చెప్పేదీ, ఏ ప్రక్రియలో దానిని ఆవిష్కరించేదీ కవి దర్శనం నిర్ణయిస్తుంది. అంటే - రచనకు సంబంధించిన భాష, అభివ్యక్తి, శిల్పం, వాహిక మొదలైన అంశాలను కవి తానుద్దేశించిన రూపానికి అనుగుణంగా తన రచనను రూపొందిస్తాడు.

కవితా సంకలనాలలో ఒక నిబద్ధత అంటూ ఉండదు. ఏకసూత్రత కూడా ఉండదు. ఎవరి స్వేచ్ఛ వారిది. దర్శనం వారి వారి స్వంతం. శైలి ఒక్కోతీరు. ఈ విభిన్నమైన కోణాలను కవితా సంకలనాలలో ఏకకాలంలో చూడవచ్చును. నవరస రుచిమయంగా ఉంటుంది. అందువలన ఈ కవితా సంకలనాలు ఉగాది పచ్చడిలాంటివి. సమైక్య భావనకు ప్రతీకలు.

అభిమానముతో, ఆప్యాయతతో ఆదరిస్తున్న సాహితీ మిత్రుల, కవుల అనురాగ స్పందనయే శ్రీలేఖ సాహితి అందిస్తున్న సంకలనాలు. ఈ సంకలనాల ద్వారా సుమారుగా శతాధిక కవులను, 35గురు కథకులను, 15 వ్యాసకర్తలను పరిచయం చేసామని గర్వంగా చెప్పుకుంటున్నాము. ఈ రచయితలందరకు కృతజ్ఞతలు. ఈ ఉగాదితో 26వ వసంతంలోకి అడుగిడుతున్నాము... "స్నేహం నీడనిచ్చే చెట్టులాంటిది" అన్న సూక్తిని నమ్ముతూ.

శ్రీలేఖ సాహితి యానంలో చేయూతను అందిస్తున్న మిత్రులకు, పెద్దలకు, అభిమానులకు ధన్యవాదాలు. శ్రీలేఖ సాహితి పుస్తకము అంటే తన స్వంత పుస్తకముగా భావించి ముద్రణలో సహకరిస్తున్న శ్రీ పి. నర్సింహారెడ్డి గారికి కృతజ్ఞతలు.

సాహితీ సేవలో ...

**డా॥ టి. శ్రీరంగస్వామి**

అధ్యక్షుడు

శ్రీలేఖ సాహితి, వరంగల్లు.

తేది : 13-04-2002,

వరంగల్లు.

# శ్రీలేఖ సాహితి ప్రచురణలు...

1. శ్రీరామ శతకము - శ్రీ టి. రామానుజస్వామి రూ. 10.00
2. కవితా గానం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి రూ. 3.00
3. ద టు జేంటిల్ మెన్ ఆఫ్ వెరోనా - డా॥ జి. దామోదర్ (తెలుగు అనువాదం) రూ. 60.00
4. వేణుతరంగాలు - శ్రీ యల్. వేణుగోపాల్ రావు (రెండవ ముద్రణ) రూ. 5.00
5. ప్రభవ (కవితా సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) ఒక సహృదయం
6. వరంగల్లు జిల్లా రచయితలవాఙ్మయజీవిత సూచిక - శ్రీ టి.శ్రీరంగస్వామి రూ. 15.00
7. కవితావనం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి రూ. 6.00
8. జన్మభూమి సిరులు - శ్రీ పల్లె సీను రూ. 6.00
9. జీవనరాగాలు - శ్రీ యల్. వేణుగోపాలరావు రూ. 10.00
10. శుక్ల (కవితా సంకలనం)- శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 5.00
11. ఎమ్మెస్సార్ కథలు - శ్రీ యం. సుబ్బారావు రూ. 9.00
12. ప్రమోదూత (కవితా సంకలనం) శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 6.00
13. నా మాట (శతకం) - శ్రీ యం. సుబ్బారావు రూ. 3.00
14. ఏకశిల వైతాళికులు(వ్యాస సంకలనం)-శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 30.00
15. ప్రజోత్పత్తి (కవితాసంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 6.00
16. కోవెల సుప్రసన్నాచార్యులు వాఙ్మయ జీవిత సూచిక - శ్రీ టి. శ్రీరంగస్వామి రూ. 15.00
17. కావ్యం-కవిస్వామ్యం - డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు రూ. 30.00
18. విశ్వనాథవారి కృష్ణ కావ్యాలు - డా॥ టి. శ్రీరంగస్వామి రూ. 60.00
19. నిరంతరం (కవితా సంపుటి) - డా॥ టి. శ్రీరంగస్వామి రూ. 10.00
20. మాధవ మాధుర్యం (కృష్ణతత్త్వ వీచిక) - శ్రీపల్లె సీను రూ. 26.00
21. ఈశ్వర (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 10.00
22. సాహితీ గవాక్షం (వ్యాససంపుటి) - డా॥ టి. శ్రీరంగస్వామి రూ. 30.00
23. సరయేవోనుండి ఏకశిలకు (అనుసృజన కవితలు) - డా॥ టి. శ్రీరంగస్వామి రూ. 30.00
24. రాగ పంక్తులు (కవితా సంపుటి) - శ్రీ పల్లె సీను రూ. 30.00
25. ప్రమాది (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 30.00
26. మనోరాగం (కవితా సంపుటి) - శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్ రూ. 30.00
27. విక్రమ (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 30.00
28. అవధానవసంతం - డా॥ ఆశావాది ప్రకాశరావు రూ. 30.00
29. వృష (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 30.00
30. నిజాం రాజు అధికారం అంతమొందిన రోజు - శ్రీనందనం కృపాకర్ రూ. 30.00
31. పెరుగుతున్న కాలుష్యం-తరుగుతున్న ఆయుష్యం - శ్రీనందనం కృపాకర్ రూ. 40.00
32. శ్రీలేఖ (కథా సంకలనము) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 60.00
33. ఉషస్సు (కవితలు) - యం. నరేందర్ రెడ్డి రూ. 20.00
34. విహంగవీక్షణ (సమీక్షలు) - ఎమ్మెస్సార్ రూ. 20.00
35. దోస్తానా (కథలు) - వరిగొండ కాంతారావు రూ. 50-00
36. కాలం వెంట నడిచి వస్తున్న...(నమిలికొండ అభినందన సంచిక)-డా॥టి. శ్రీరంగస్వామి(సం.) రూ. 40.00
37. చిత్రభాను (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 40.00

# మనిషికంటె కృతఘ్నుడు ఎవరు ?

- డి. శ్రీధరాచార్య

వసంత కాలం-అనంత లాస్యమై
దిగంతాల నడుమ-ప్రకృతి సీమపై
పులకరింతలు పొడిమి-భూగర్భము చలించి
తరుశాఖలు చీల్చుకుని-శాఖోపశాఖలై
నవనవోన్మేష చివుళ్ళు జనించి
ప్రకృతి పరవశం-పొందడం సహజం
కాని, ఇలా తలంపై మానవ 'స్వార్థం'
కత్తులుదూసి-కరుకు గుండెలతో
తమ కుత్తుకల్ని-తామే నరుక్కునే
క్రూర కసాయితనంతో-
చివుళ్ళను-ఇగుళ్ళను-కాదు
మొత్తం వనసీమల్ని
నరికి-నాశనం చేస్తోంటే-
'మూగజీవాలు' కకావికలై
పరుగులుదీసి-ప్రాణాలు వదులుతుంటే-
మూగప్రాణుల-ఎముకలు-చర్మాలు-
అమ్మి-మనుగడ సాగిస్తున్న,
'మనిషా' ప్రకృతిలో గొప్పవాడు ?
ప్రకృతి మనిషికి చేసిన అన్యాయం ఏమిటి ??
గాలి ! నీరు !! తిండి !!!
అన్నీయిచ్చి బ్రతికిస్తోందే !!!!
ఇంతకంటే కృతఘ్నత ఏది ?
మనిషికంటే కృతఘ్నుడు ఎవరు ??

ఇ.నెం.9-40, రాజీవ్‌నగర్ కాలనీ, ఆదిలాబాద్ - 504 001

# చిత్రభాను

- శీలం రాజేశం

ఎండకు వానకు ఛత్రం ! చిత్రం !

కూటికి రోటికి పాట విచిత్రం !

విజన్ ట్వంటీ ట్వంటీ కాలం ! అవ్వా !

ఒక ఓటేయ్ బాంచను !

సీటెక్కి కూర్చుంట !

ఊరూర వాడవాడల

ఇల్లిల్లు ఎల్లవేళల తిరుగుతున్న

ఇచ్చే ఓటేదో నాకే వేసేయ్ !

మీతోనే ఉంటా ! మీ సొమ్మే తింటా !

అందినంత-అప్పుచేస్తా

అట్టెసరు-అభివృద్ధి చేస్తా !

హైటెక్కు ట్రిక్కులు చూపుతా !

చేనేత వారైనా-డొక్కెండిన రైతైనా

పారదర్శకములో పండ్లు ఇగిలిస్తా !

పల్లెపట్టుకొమ్మల్లో కోటికొమ్మలాడిస్తా !

నిరుద్యోగ యువతను

నిరంతరం రోడ్డు దిమ్మరిగావిస్తా !

దిమ్మ తిరిగేయట్లు గూటిపన్ను వడ్డిస్తా !

కంటికి కునుకురాకుండా

కుంటి సాకులు శోధిస్తూ కుచ్చు టోపీ తొడిగిస్తా !

ఇ.నెం.5-9-29, లష్కర్‌బజార్, హన్మకొండ, వరంగల్లు-506 001

# నీవు

- కురిమిండ్ల సృజన

ఇంకెన్నాళ్లీ పరాధీన బతుకు అని
బతుకంతా నీరసించే బదులు
బూజు పట్టిన నీ ఆలోచనలను
బూజు దులిపి పదునెక్కించుకో !
అవే నీ తలరాతని మారుస్తాయని తెలుసుకో !
నిన్ను పొగడ్తలతో ముంచెత్తి
అనాచారాల జిడ్డుతో కప్పెడుతున్న
సమాజాన్ని హైటెక్ కుట్రలను నిలదీసే
ప్రశ్నగా పరివర్తన చెందు.
బతుకు స్వేచ్ఛ కోసం పోరాడాల్సిన
బాధిత స్త్రీవి నీవు
నేను పీడిత స్త్రీని అని కృంగిపోకు
కొలిమి నుండి లేచే అగ్నికీలవై
ముసుగులను తెరలను
చెరలను దహించెయ్
చీకటితో సుదీర్ఘ పోరాటంచేసి
గెలుపుల వెలుగులు ప్రసరించే
క్రొత్త ఉదయాలను స్వాగతించు నీవు.

ఇ.నెం.3-14-450/3, దుర్గా కాలనీ, రెడ్డి కాలనీ, హన్మకొండ-506 001

# భారం

- ఎం. భండారి

అగ్రిమెంట్లకమ్ముడు పోయే

అర్ధబానిసత్వాన్ని సైతం

హర్షించలేకపోయినా

సంపూర్ణ బానిసత్వానికి

నాకై నేనే సరెండరైపోయి

అడుగులకు మడుగులొత్తుతున్నాను

ఆకలి అభిమానాలు

ఆశయాన్ని ఇరువైపుల

చురకత్తుల్లా పొడుస్తుంటే

మనసు క్షణ క్షణం

చిత్రవధను అనుభవిస్తుంది

చావడానికైనా, బతకడానికైనా

భారం అవుతుంది.

క్వార్టర్ నెం.333/డి, సి.ఐ.డి. కాలనీ, కాచిగూడ, హైద్రాబాద్-500 027

# నన్ను క్షమించు కన్నా !

- నామిని సుజనాదేవి

పురిటి పొత్తిళ్ళ వెచ్చదనం పూర్తిగా వీడకముందే
బ్రాహ్మజ్ఞానంవీడి బాహ్యలోకాన్ని వీక్షించక ముందే
నులివెచ్చని మాతృ ఒడి, పాల మధురిమ ఆస్వాదించక ముందే
నిర్దాక్షిణ్యంగా పట్టుకోలేని చేతులకు పాల సీసానందించి
కేర్ సెంటర్లో ఆయా చేతుల్లో నువ్వేడుస్తుంటే
ఆర్తిగా అక్కున చేర్చుకోవాలనుకున్న నేను
గడియారాన్ని చూసిన కళ్ళ
సంకేతానికి ప్రతిస్పందించి
మనస్సందించిన ఆదేశానుసారంగా
అలివేణి మనస్సు వెన్న అన్న నానుడి
అబద్ధం చేస్తూ అలివేణి మనసు వెండిలా సరిచేసుకునేలా
కర్కశ హృదయాలనుసైతం కరిగించగల నీ
కన్నీరు కఠిన పాషాణమైన నా హృదయాన్ని కరిగించలేక
మాతృ హృదయం అమృతం అన్న
కవి మాటలు అబద్ధం చేస్తూ
వెళుతున్న నన్ను క్షమించు కన్నా !
అన్ని సదుపాయాలు కల్పిస్తున్నాననే
సాకుతో, కర్తవ్యం మరిచి కర్కశంగా కాసులకు
కడుపుతీపి నమ్ముకుంటున్న ఈ
కన్నతల్లిని క్షమిస్తావు కదూ కన్నా !

L.I.C. of India బ్రాంచ్, పోచమ్మ మైదాన్, వరంగల్లు-506 012

# అడవి న్యాయం

- అంబల్ల జనార్ధన్

నోరున్న వారిదే ఊరనే వారు కాని ఈ రోజుల్లో ?
ధనవంతులదే ఊరు, బలవంతులదే రాజ్యం
ఎవరితోనేం, ఏ పనైతేనేం డబ్బు ఎర చాలు,
కాదూ కూడదంటే, దండం దడ పుట్టిస్తుంది
పార్టీ టికెట్టుకు సేవ కాదు కొలబద్ద ఉండాలి
బుద్ధిజీవులంతా తమ ఓటు హక్కు వాడక
ముక్కు మూసుకుని ఇంట్లో కూర్చుంటే
నోట్లతో ఓట్లు కొని గద్దె నెక్కుతున్నారు అధములు
పీడిస్తున్నారు జనాన్ని శాయశక్తులా
దోచుకుంటున్నారు దేశాన్ని నాలుగు చేతులా
మందులూ, ఎరువులూ, పశుగ్రాసం, శవపేటిక
చక్కెరా, సిమెంటూ, టెలికామూ కావేవీ స్కాము కనర్హం
ఆశ్రిత జనపక్షపాతంతో అధికార దుర్వినియోగంతో
ప్రజాస్వామ్యం సాక్షిగా పదవులను కాజేసి
దొంగలు దొంగలు ఊర్లు పంచుకున్నట్టు
ప్రత్యక్షంగా, పరోక్షంగా ఏలుతున్నారు రాజ్యాలు.
విధిరాతను నొసటి గీతను మార్చడం మనవల్ల కాదని
ఎవరి పాపకూపంలో వారే పడి చస్తారని
ఎవరో వస్తారని ఏదో చేస్తారని మనలో మనం అనుకుంటే.
మేకవన్నె పులుల విజృంభణ ఖాయం, మన మనుగడ దుర్భరం.
అన్యాయాలకు అక్రమాలకు సభ్యత్వపు ముసుగేసి
నేత కుక్కలు దేశ విస్తరిని చిందర వందర చేస్తుంటే
నిరాసక్తతో, నిరాశతో మనం నీరస పడిపోతే
అడవి న్యాయమే అసలు న్యాయమౌతుంది.

బి-204, ధీరజ్‌కిరణ్, చించోటిబందర్ రోడ్, మాలాడ్(వెస్ట్), ముంబై-400 064 ఫోన్: 8751550

# అత్తరు మట్టి

- అనిశెట్టి రజిత

మట్టిలో పుట్టి మట్టిలో కలిసే మనిషికి
మట్టి వాసన తెలియకుంటేనే ఆశ్చర్యం
వాన కురిస్తే ఆవిర్లెత్తే మట్టి వాసన
మట్టిలోంచి మొలిచే పచ్చని మొక్క
లేలేత పసికందుల పూల వాసన
మట్టి బంధమే మనిషికుండే శాశ్వత బంధం
ఒక వాస్తవిక స్వర్శానుబంధం

* * * * *

శ్రమను మించిన ధనం
చెమటను మించిన అత్తరు ఏమున్నది
శ్రమజీవులకు చెమటే అత్తరు
కన్నీరే పన్నీరు
మట్టే బంగారం
మట్టంటే జీవ వనరు
వనరులన్నింటికీ మూలమైన తల్లి వనరు

* * * * *

ఆ మట్టిని సేవించే మనిషే
నా మహాదైవం
ఆ మట్టి వాసనే నాకత్తరుమయం.

ఇ.నెం.3-12-60, కుమార్‌పల్లి, హన్మకొండ, జి॥ వరంగల్లు-506 001 ఫోన్: 450493

# భారత-బాధ

- డా॥ కాసర్ల రంగారావు

మానవ జాతి మహాప్రస్థానంలో మతం వాత
జాతి గుండె చప్పుడులో మతం కోత.
ప్రపంచ ఆధిపత్యానికై మతమౌఢ్యపు కాపు సారా
కాపు కాచి కాయిస్తోంది అగ్రరాజ్య డేరా
బ్రోకర్లై పాకిస్తాన్ తాగిస్తోంది యువతతో మనసారా
"మతం మత్తు" అన్నావా మార్క్సు
సారాకే ప్రత్యామ్నాయం చేసారిట క్రూక్స్.
అమెరికాయే ఇప్పుడున్న అతిపెద్ద కామందు
ప్రపంచానికి దాపురించిన అత్యుగ్రపు రాబందు.
తన ఒంటిని తన ఇంటిని చక్కదిద్దలేని బడాయి
ప్రతి సందున ప్రతి గొందున తన మాటే చెల్లాలని లడాయి.
కోరలు తీసిన పామై పోయిందిక రష్యా !
ఎందుకింక పాత కథ చెప్తావు శిష్యా ?
గరళాన్ని-గగనాన్ని మ్రింగినట్టి చైనా
మంచీ-చెడు గ్రహిస్తుంది ఇకనుంచైనా.
మూర్ఖునికి ఇరుప్రక్కల అమెరికా-చైనా
ముప్పేటల దాడులతో భారత్ సతమతమౌనా.
సాచి కొట్టె చెప్ప దెబ్బ ఒసామా బిన్‌లాడెన్
బుద్ధి రాదు వానికింక ఏమి చెప్పదున్.
ఎంత చక్కని నీతి సూక్తులు చెప్తున్నాడు చూడు
విడువలేడు ఇప్పటికైనా ప్రియ నేస్తం తోడు.

Qtr. No. B.E.-18, IM Colony, KTPS పాల్వంచ, జి॥ ఖమ్మం-507 115

# నేనెవరిని ?

- భండారు విజయ

మానవ హోమంలోని చితుకును
భయం గుప్పిటిలోని బందీని
పట్టపగలైనా, స్వాతంత్ర్యం లేని బ్రతుకును
కట్టుబాట్ల పలుపు తాళ్లను మోసే మెడను
సంకెళ్ళుబడిన స్వేచ్ఛను
బాధ్యతలే తప్ప హక్కుల భాష తెలియని లిపిని
యాసిడ్ పూతల ప్రేమను
ఆత్మహత్యల నోవాక్రానును
తలారా స్నానమాడే కిరోసిన్‌ను
నన్ను నేను బందీగా మార్చుకొని
భావాలని విడిచిన బట్టల్లా బకెట్లనిండా నానబెట్టి
డిగ్రీలన్నింటిని మేకులకు తగిలించి
చేసే ఉద్యోగానికి న్యాయం చేయలేక
రాజీనామా పత్రాన్ని కూడా
ఇనుప బీరువాలోని చీరల మడతల్లో దాచిపెట్టి
అక్షర జ్ఞానాన్ని కేవలం
అమ్మతనానికే అంకితమిస్తూ
ప్రజ్ఞా పాటవాలన్నింటిని కుటుంబంలోకి కుమ్మరించి
మసి బారిన పొగ గొట్టాన్నై
వచ్చే పోయే అతిథులకి మర్యాదనై
సగటు స్పృహను కోల్పోయిన ఇల్లాలిని
బ్రతుకుతూ... చస్తూవున్నా.....
మానవీయతకు అద్దంపట్టిన ఆడదాన్ని.

F-10, B-1, HIG-I, బాగ్‌లింగంపల్లి, హైద్రాబాదు-500 044

# ఓ... ఉగ్రవాదమా ! ఓ... యుద్ధోన్మాదమా !

- 'కవిశశాంక' డా॥ ఆడెపు చంద్రమౌ

ఉగ్రవాదం - దురాక్రమణ వాదం,
యుద్ధోన్మాదం... తీవ్రవాదం !

అదే ఇది... ఇదే అది... పేరు ఏదైతేనేం ?
అన్నింటిలో కామన్ విషయం... అదే రక్తపాతం !
అందరి గుండెల్లో భయోత్పాతం - అనంత విషాదం,
అదోగతి తాండవం - అశాంతి ప్రభంజనం !

యుద్ధంలో ఎవరూ ఓడరు...
మరింకెవ్వరూ గెలువరు...
యుద్ధంలో యుద్ధమే గెలుస్తుంది
విశృంఖల వికృతమే నిలుస్తుంది !

ఓ ఉగ్రవాదమా ! ఓ యుద్ధోన్మాదమా ! ఓ దురాక్రమణవాదమా
ఓ తీవ్రవాదమా ! మనిషికి ప్రాణం పోసింది నీవు కాదు !
ఆ మనిషి జీవితాన్ని తీర్చిదిద్దింది నీవు కానే కాదు...
అలాంటప్పుడు ఆ మనిషి ప్రాణం తీసే హక్కు నీకెక్కడిది ?

టెర్రరిజం ముసుగుతో హర్రరిజాన్ని సృష్టిస్తున్నావు
విషవలయాన్ని గీస్తూ మారణహోమాన్ని పోషిస్తున్నావు !

ఇప్పటికైనా... నీ తప్పు తెలుసుకో,
మానవత్వముతో మసలుకో,
చేసిన తప్పుకు తలవంచుకో,
ఎత్తిన తుపాకీని దించుకో !!

ఇ.నెం.19-10-257, శంభునిపేట, పోస్టు: రంగశాయిపేట, వరంగల్లు-506 005

# 'అమ్మ' దైవమే !

- జోస్యం విద్యాసాగర్

'అమ్మ' అనే పదాన్ని ప్రథమమ్ముగ పల్కిన నాడు లోక మం
దమ్మ తనొక్కతేయయిన దర్పము గుండెల పొంగిపొర్ల, నే
త్రమ్ముల కాంతిపుంజములు రంజిల, మోమున నూత్నమౌ మయూ
ఖమ్ములు కానుపింప, పులకాంకురముల్ మెయినిండ గల్లగా
నెమ్మది సంతసమ్ము వెసనిండగ నవ్వెడు 'అమ్మ' దైవమే !

'నాన్న' అనమ్మ 'నా...న్న' అను 'నాన్న' అటంచు పదాలు నేర్పి "మా
నాన్నయె యెంత తొందరగ 'నాన్న' అనేసె"నటంచు బుగ్గపై
ఎన్నివిధాల ముద్దుల నవెన్నిటి బెట్టెనో లెక్కలేదు "మా
కన్నకు బుద్ధిమిన్న పలుకాడిన చాలొకసారి నేర్చు యే
మన్నను వెంటనే" అనుచు ఆశల తేలెడు 'అమ్మ' దైవమే !

పాలను త్రాగు బాలుని గబాలున నన్నులు చూతురంచు చ
న్బాల నొసంగు వేళ తనపైట చెరంగును కప్పియుంచు డా
కేలను కొంగు తీసి చిలికించెడు నవ్వుల జూచి "తుంటరీ
చాలును లీల లల్లరులు చాలును ఆకలి లేదటంచు గా
రాలను పోవు చిన్నినను రాగముతో గను 'అమ్మ' దైవమే !

పడిశెము పట్టునీకు వెధవా జడి వానలనేమి యాటరా !
తడిసిన నీ కురుల్తుడిచెద వడిగా" యని గుండెమీది ఆ
పొడి పొడి పైట తీసి తడి పూర్తిగ వే తుడిచేసి, ప్రేమగా
ఒడినను చేర్చి, గుండెనున్న కుదుష్ణపు హాయిగూర్చి, ము
బ్బడి యగుప్రేమ ముద్దు మురిపాలను చూపెడు 'అమ్మ' దైవమే !

కన్నులు కొంచె మెర్రబడి గట్టిగ తుమ్మిన లేక దగ్గినన్
"చిన్నికి జబ్బుచేసె"నని చిందులు తొక్కును కాలుసేతు లే
మన్నను వెచ్చనాను అనుమానముతో స్పృశియించి చూచి లే
దన్న నిజమ్మెరింగియు నిదానము చెందక తృప్తిలేక 'వెం
కన్న'కు మొక్కి వే ముడుపు కట్టు అమాయిక 'అమ్మ' దైవమే !

---

"జోస్యము", 12-2-877/5, కాంతినగర్, మెహదీపట్నం, హైద్రాబాద్-500 028

---

# పండుటాకును నేను...

- కుసుమ వెంకటరత్నం

పండుటాకును నేను - రేపోమాపో

రంగులుడిగి రాలిపోయే దాన్ని !

ఎన్నో జడివానలకు తడిచి-

ఎండి నిలిచిన దాన్ని !

వడగాలుల ఎండలలో-

వడిలిపోయి బడలి బ్రతికిన దాన్ని !

ఎన్నో కుసుమాలను నా ఒడిలో దాచి పెంచిన దాన్ని

ఏమీలేని ఒంటరిగా యిపుడున్న దాన్ని !

ఓ చిన్నారి లేత చిగురుటాకా !

నీలాగే ఒకప్పుడు నేనూ-

నీ మేను సొగసులు చూచి-మురిసిపోకు

భవిష్యత్తులో భంగపడగలవు జాగ్రత్త

చిరుగాలికి చిందులువేయకు-చినిగిపోగలవు

ఎన్నో వసంతాలు నిండాలి నీ బ్రతుకులో

ముల్లు నీమీదపడ్డా-ముండ్లమీద నీవుపడ్డా

చినిగి చెడిపోయేది నీ బ్రతుకే !

సుకుమారివిప్పుడు నీవు-రేపు ముదిరిటాకువు

ఆపై నాలా పండుటాకువవుతావు-

తర్వాత నీ స్థానం నీకు తెలియదు

తెలివిగా మసులుకో-ముందుచూపు చూచుకో !

ఇ.నెం.3-14-560, కుసుమ నిలయం, న్యూ కొత్తూరు, హన్మకొండ. ఫోన్: 438377

# గ్లోబలౌజేషన్

- కొలకలూరి (నడకుర్తి) స్వరూపరాణి

రవి అస్తమించని ప్రేమచిహ్నం
ఇరుముఖాలు
రెక్కలు దాల్చిన నగ్నశిశువు క్యుపిడ్
చిలుకరౌతు మన్మథుడు
మనస్సరస్తరంగ యవనిక
తామరాకు ప్రేమగుర్తుల చిత్రణ
ఒక క్లియోపాత్రా వయసు వేదికన ప్రేమకావ్యావిష్కరణ
బంగారు బాణం జ్యోతి ప్రజ్వలన
ఉపసంహారం రసాయనిక చర్య
సీసం బాణం ప్రత్యామ్నాయ మూలకం
ఏ-పెంపుడు పాముకాటో సర్వమంగళం
వలపు తొలకరికి అంకురార్పణ
అడ్డుకట్ట మంత్రం లేదు
మదన సారథ్యం పద్మవ్యూహం
బలవన్మరణం నిషేధం భారతీయ శిక్షాస్మృతి
పంచబాణాలు పంచమ శ్రుతి
చెరుకు వింటి శరసంధానం
విధించిన శిక్ష ఆమరణ ప్రేమాహారదీక్ష
రక్షక పత్రకలశంలోంచి మనసు గులాబీ పుష్పం
కన్నీటి బిందువులు ఘనీభవిస్తే అక్షరాలు
కాగితం గర్భంలో ముత్యాలైతే ప్రేమపత్రం
మనసూ మందిరమే ప్రతిష్టిస్తే ప్రేమ చాలు
దైవం శిలయైనప్పుడు ఆ-అర్భకుడికి ఉన్నట్లే
ఈ-అతనుడికీ సీసం బాణం ఉన్నట్లైతే ఎంత బాగుండేది !

ఇ.నెం.35-3-80/6, జక్రియా హాస్పిటల్ సెంటర్, చెన్నకేశవస్వామి వీధి, ఒంగోలు-523 00

శ్రీలేఖ సాహితి

# కలం ఎంత గొప్పదో !

కనుచూపుల కదలికల్ని
మెదడులోని పదునైన వాదనల్ని
ఆ శోధనలోని పరిశోధనల్ని
ఆవేదనలోని నివేదనల్ని రాడార్‌లా పసిగట్టి
అక్షరాలను అస్త్రాలను చేసి
కాగిత ప్లాంట్‌లో బందీచేసే (ఫొట్)
ఆ కలం ఎంత గొప్పదో !
కలం ద్రవిస్తే కవితా కడలి ప్రవాహాలే
కలం కరుణిస్తే కరుణారస జలపాతాలే
కలం పుష్పిస్తే సుగంధ మధురిమ శోభితమే
కలం జ్వలిస్తే భగభగమండే అగ్నిగుండాలే
కలం ఆగ్రహిస్తే లావాల పిడుగులే
కలం ప్రేమిస్తే మధుర స్నేహబంధాలే
కలం హలమైతే పెను చీడల పెకిలించివేయడమే
కలం జనం గుండెల్లో ఆమనియై విరబూస్తుంది
కలం ప్రభంజనమై శంఖారావం పూరిస్తుంది
కలం కాలప్రవాహంను గుండెల్లో దాచుకుంటుంది
కావ్యవాహినియై జనారణ్యాన్ని హరిత చైతన్యుల్ని చేస్తుంది
ఆ కలం ప్రజాకలం
అమరం అజరామరం

శనిగరపు రాజమోహన్, ఇ.నెం.24-4-336, దర్గా కాజీపేట, వరంగల్లు-506 004

# విశ్వంలోకి వెళ్ళిపోదాం...

- "మునీ"

పుట్టుక నాకో మతాన్నిచ్చింది
అది నీ మతం కాకపోవచ్చు
పుట్టుకే నాకో జాతినీ ఇచ్చింది
అదీ నీ జాతి కాకపోవచ్చు
భాషా... వేషాలు... ఎన్నో... ఎన్నెన్నో...
నీ మతంలో పుట్టినా పరమతస్తులకు పరాయినైపోదును
నీ జాతిలో జన్మించినా పరజాతీయులకు పరదేసీనైపోదును
అన్ని వేషభాషల్లో-అన్ని వర్ణవర్గాల్లో-కులాల్లో మతాల్లో-
అన్ని జాతి రీతుల్లో
ఎలా పుట్టగలను నేస్తమా... నేనెలా పుట్టగలను ?
అయితే...
పుట్టిన మతం నుండి మాత్రం
నిను ప్రేమించడం నేర్చుకున్నాను
పెరిగిన జాతి హద్దుల్ని జవదాటి
నీ సరిహద్దుల్లోకి రావడం నేర్చుకున్నాను
నేర్చిన భాషతో నిను సంభాషించడం నేర్చుకొన్నాను
ఒక్కటొక్కటిగా సంకుచితాలను సంధిస్తూ
వ్యాకోచించుకోవడాలు నేర్చుకున్నాను
ఇదంతా నీ కోసం
నిన్ను నిన్నుగా ప్రేమించడం కోసం
నువు నన్ను నన్నుగా చూడగలిగితే నాకది చాలు
మనం మనంగా రెండు కపోతాలమైపోదాం.

...మద్ సిరాజొద్దీన్, ఇ.నెం.24-4-189, దర్గా కాజీపేట, వరంగల్లు. ఫోన్: 430805

# జ్ఞాపకాలు

- వరిగొండ కాంతారావు

కంటికింపు ఉద్యానము
కంటగింపుగా తోచెను
గులాబీల పరిమళాలు
దుర్వాసనలైపోయెను
వాయులీన ధ్వనులు
చెవికి దుశ్శబ్దాలైపోయెను

బాహ్యమంత బాగుండెను
అంతరంగమందె బాధ
దుష్టమైన అనుభవాల
కొఱత శిక్ష జ్ఞాపకాలు

స్వర్గంలో నివసిస్తూ
భోగాలతో సుఖియిస్తూ
జ్ఞప్తికి మరిమరి తెచ్చుకు
నరకయాతననుభవించు
మనసు నుండి విముక్తి కొరకు
భగవంతుని ప్రార్థించెద.

# ఆదర్శం

- కందాళ సుదర్శన్

అమ్మ ఒడిలో హాయిగా ఆనందంగా !
ఆడుకొన్న బంగారు బాల్యం
మరచిపోలేని ఓ ! మధురక్షణం
మళ్లీ జీవితంలోకి రాదు కదా !

పలకా బలపం పట్టి
మట్టిలో చెట్టు క్రింద కూర్చొని
అక్షరాలు దిద్దుకొన్న అనుభవం
జీవన సౌధానికి తొలి సోపానం

అమ్మానాన్నల ప్రేమ నోచుకోక
ఒంటరినై ఒండుకొని తింటూ
నేస్తాలతో కష్టించి కలిసి చదువుకొన్న కాలం
నేటి సుఃఖజీవనానికి సుందర మార్గం

స్థిరపడిన నా బ్రతుకు వసంతంలోకి
మంత్రాల మంగళవాద్యాల తోరణాలతో
ఉగాది ఉషఃస్సులా మనసు మందిరంలోకి వచ్చి
శాంతిగా సహచర్యంతో సహధర్మచారిణివై
బాధలన్నీ బాపి బ్రతుకుమార్గం చూపాలి
భారతావనికి ఆదర్శం కావాలి.

ఇ.నెం.7-8-84, మచిలీబజార్, హన్మకొండ, వరంగల్లు-506 011

# న్యాయం

- "విధాత"

నే మరణిస్తుంటాను

మరణించే ప్రతీసారి ఓ ఘట్టం జరుగుతుంది

అంతర్‌యుద్ధం సమూలంగా మనసును,

మనిషిని అంతమొందిస్తుంటుంది

కారణాలు ఏవైనా, కారకులు ఎవరైనా

శిక్ష మాత్రం నామీద అమలు జరుపబడుతుంటుంది

వాదింపబడలేని చట్టం

"తప్పిదము నాదే" అన్న ప్రవచనమును

వెలువరింపజేస్తుంటుంది.

నా అసహాయత, అసమానత శిక్షను

అమలు జరుపడానికి తోడ్పడుతుంటాయి

నన్ను మరణింపజేయు క్షణం,

నను ఆలింగనం చేసుకొనుటకు

ఎదురుచూపులు చూస్తుంటుంది

దాని నిరీక్షణ ఫలిస్తుంది

ఈ అసమతుల్యాల నడుమ మరణించిన

'నేను' ఘోషిస్తుంటాను

నా మరణం ఎంత వరకు న్యాయమని.

# చిత్రపటం

- వి. సత్యసురేఖ

ఆ చిత్రకారుడు పొదుపరో లేక

రంగు అయిపోయినదో కాని

ఆకాశంలో సన్నటి తను గీసాడు

అయినా నెలవంక కనబడుతోందిలే.

చిన్నపిల్లాడు రంగంతా పారబోశాడేమో

ఆకాశం మరీ దట్టంగా నీలంగా ఉంది.

ఆ తల్లి వడియాలు ఆరబెట్టిందో ఏమో

ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి

ఏ తుంటరి వచ్చి ఒలకబోసాడో చిక్కటి పెరుగు

పేరుకుపోయింది మబ్బులా

ఎవరి దృష్టి తగిలిందోగాని

పగలంతా ఎర్రగానే ఉంది ఆకాశం

అమ్మకెంత ఓపికో

అంతసేపూ తీసింది దిష్టి.

-70, జీవనమిత్రా నగర్, విద్యారణ్యపురి, హనుమకొండ-506 009

# ఇగురని గంధం

- కాళోజి రవికుమార్

రెండు హృదయాలను కలిపేదే ప్రేమ
దానికి లేదు కులమత భేదం
ఎందుకు ఇతరులతో వాదం
రెండు జంటలను కలిపితే వివాహబంధం
ప్రేమకు లేదు పేద, గొప్ప భేదం,
అది ఇగురని గంధం
ఇద్దరిని చేస్తుంది ఒకటి
ఇద్దరి మధ్య కుదురుస్తుంది ఆత్మీయత
మంచితనానికి విలువ ఇస్తుంది
ఉమ్మడి కుటుంబాలకు వెలుగు ఇస్తుంది
అందరికి మేలు కుదురుస్తుంది
యుగాలు మారినా పెద్దల చాదస్తం
వెన్నెలలాంటి హృదయం
హృదయం ఇస్తుంది మమత
వారిలోగల నవత-అది లేనిదే ఎక్కడ మానవతా ?
వాటికి లేవు ఎల్లలు-ప్రేమకు లేవు సరిహద్దులు
మంచితనం ముందు డబ్బులుఉన్నా ఉండదు
ఉన్నదాంట్లో సంతృప్తి పడ్డనాడు
ఆ రోజే పండగ.

ఇ.నెం.2-5-311, కాళోజి వీధి, నక్కలగుట్ట, హనుమకొండ-506 001

# జాతీయత

- ఆడెపు రవీందర్

ఎటువైపు చూసినా హింసే కనబడుతుంది !
నలుదిక్కుల భారతం ద్వేషంతో రగులుతోంది !
శాంతియుత జీవనం కనుమరుగు అయ్యింది !
'జాతీయత' భావము అడుగంటిపోయింది !

'మన కులం' ఏదైతేనేం ?
'మనుషులం' మనమంతా !
'మన మతాలు' వేరైనా 'అభిమతాలు' ఒకటేగా !
'భాషలు' ఏవైతేనేం ?
'భావాలు' మారవుగా !
'ప్రాంతం' ఏదైనా 'దేశమంతా' మనదేగా !

కుల, మత, భాష, ప్రాంత భేదాలు మరచిపోయి !
'జాతీయత' లక్ష్యముగా,
ప్రతి అడుగు ముందుకేసి !
'జాతీయ సమైక్యత'ను
కలసిమెలసి సాధించి !
భరత జాతి గౌరవాన్ని సగర్వంగా నిలపాలి !

టీచర్, ప్రభుత్వ రైల్వేగేట్ హైస్కూల్, పెరుకవాడ, జి॥ వరంగల్లు-506 002

# వాల్కెనో సిటీ

- కేశబోయిన కాశీనాథ్

ఈ... వరంగల్ ఒక 'వాల్కెనో'-నిత్యం ఇదొక నిప్పుల నగరం....

ఈ... వరంగల్ ఒక రణభూమి-ఇక్కడ నిత్యం రక్తతర్పణం....

అటు పేల్చివేత-ఇటు కాల్చివేత

ఇంకెక్కడో కూల్చివేత-మరెక్కడో నరికివేత

ఎవరి కోపం ఎవరిపైనో తెలియదు

ఎవరి పాపం ఎవరిపైనో తెలియదు

పాత కక్షలొకవైపు-ముఠా హత్యలొకవైపు

ఆ-హంటర్ రోడ్... అవునది హంటింగ్ రోడ్...

ఆ-గుట్ట రాలిపడుతున్న పిట్టలకు సాక్షి....

ఆ-పద్మాక్షి పోతున్న ప్రాణాలకు సాక్షి..

ఆ-భద్రకాళి ఇక అవుతున్నది అభద్రకాళి...

నల్లేరు మీద నడక కాదు-ఈ... నగర జీవితం

'అంపశయ్య'పై ఆఖరి శ్వాస-ఈ... నగర జీవితం

ఈ... ఓరుగల్లు-ఎప్పుడు....

గొల్లుగొల్లున ఏడుస్తుందో ఎవరికి తెలియదు...

ఈ... ఓరుగల్లు-ఎప్పుడు....

ఏ గగ్గోలు పెడుతుందో ఎవరికి తెలియదు...

ఈ... ఓరుగల్లు-ఎప్పుడు....

ఏ 'గొడవ' తెస్తుందో ఎవరికి తెలియదు....

ఎవరి డ్యూటీ వారిది.... ఎవరి జీవితం వారిది

ఎవరి లక్ష్యం వారిది... ఎవరి ప్రాణం వారిది

అయినా... పగలతో సెగలతో....

వాళ్లను వీళ్ళు-వీళ్లను వాళ్ళు.... ఒకళ్లనొకళ్ళు

చంపుకోవడం లేదా చావడం తప్పితే....

మంచి 'బతుకు'నిమ్మని మన మహిళలు...

కొలిచే-ఈ... బతుకమ్మ వాడలో...

అయ్యయ్యో బతుకు జాడ ఏది ?

అయ్యయ్యో బతుకు నీడ ఏది ?

ఆ-మహాకవి మాటల్లోనే చెప్పాలంటే....

ఈ నగరం-బుగులుకునే బుక్కా గుండా....

ఆ-మహాకవి మాటల్లోనే చెప్పాలంటే...

ఈ నగరం-పులి చంపిన లేడి నెత్తురు...

అవునవును... అవునవును... అవునవును....

ఈ.... వరంగల్ ఒక 'వాల్కెనో'-

నిత్యం ఇదొక నిప్పుల నగరం......

ఈ.... వరంగల్ ఒక రణ భూమి....

ఇక్కడ నిత్యం రక్తతర్పణం.

# ప్రేరణ

- ఎం.వి. ప్రసన్న

కదలలేని మనిషికి కాళ్ళు ఎందుకు ?

నిలువలేని మనిషికి నరాల బలం ఎందుకు ?

చూడలేని కన్నులకు చూపులు ఎందుకు ?

నిలకడలేని మనిషికి నిజాయితీ ఎందుకు ?

నిజం పలుకలేని మనిషికి నరంలేని నాలుక ఎందుకు ?

మాట్లాడలేని మనిషికి అరిచే గొంతు ఎందుకు ?

తినలేని వారికి చరిచే చేతులు ఎందుకు ?

వినలేకపోతే చేటంత చెవులు ఎందుకు ?

విజ్ఞానం మరిచిన వివేకమ్మైన విద్య ఎందుకు ?

పేదల ఆకలి తీర్చని ప్రభుతలు ఎందుకు ?

ఆలోచించలేని మనిషికి తలలో మెదడు ఎందుకు ?

ఆకలి ప్రేగులకు ఆవేశం ప్రేరణ-

అణిచే శక్తులకు అసహనం ఆయుధం

అనుభవించలేని మనిషికి ఆస్తుల అంతస్తులా !

పదుగురికి ఉపయోగపడని సంపద

పాడుబడిన బావి చందము....

సుఖశాంతులు లేని నూతన సంవత్సరము

శ్మశానంలో సౌందర్యోపాసన....

ఇ.నెం.6-8-30, రాగన్నదర్వాజ, హనుమకొండ-506 011

# విత్తనం

- "అపరాజిత"

తరుజలపాషాణాలు

పంచభూతాల నిర్మితం

ధరిత్రినడ్డదిడ్డంగా

ధర్మంఅని తలచినా

తలపోయకున్నా

హలంతో గుండెల చీల్చి

విత్తమందు తోచిన

విత్తనాల వెదజల్లడం

గరళాన్నిచ్చేవైనా

గట్టి సారాన్నిచ్చేవైనా

తనువులో ఇముడ్చుక

తగిన 'ఫలితాన్ని'స్తుంది

పుడమి సారాన్నందించి

పుడమి నుండి జనించిన

మట్టిబిడ్డలం మనం

తనువనే మట్టిలో

విత్తిన విత్తనమే

మొలకెత్తి విస్తరిస్తుంది

గళమెత్తి పాడుతుంది

సున్నితంగా సుతిమెత్తగా.

పొట్లపల్లి ధరణీశ్వర రావు, ఇ.నెం.1-306, చాణక్యపురి, భీమారం, వరంగల్లు-506 015

# ఓ బాపూ ! మరోసారి జన్మించవూ ?

- రంగు చక్రపాణి

ఓ బాపూ ! మరోసారి జన్మించవూ ?
దేశాన్ని పీడిస్తున్న ఈతిబాధలు బాప !
నాడు నీవు అహింసాయుధంతో
పారతంత్ర బానిస సంకెళ్ళను పటాపంచలు చేసితివి
కాని నేడు దేశంలో హింసాయుధంతో కసాయితనం, క్రూరత్వం
నలుదిశల తాండవిస్తున్నది !! ఓ బాపూ....
దుష్ట గ్రహాలను ప్రేమానురాగంతో జయించాలని నీవు
దృష్టాంతములతో చాటి చెప్పితే
ఇంద్రియ నిగ్రహ, సత్యాహింసలకు దూరమై
పనికిరాని ఆవేశాగ్రహములకులోనైన దుష్టాసురులు,
దేశద్రోహులు కపట విప్లవ గ్రహాలు "నీ బోసి నవ్వు చూసైనా
మారవోయి ఓ నవయువకుడా" అని బోధించే
నీ విగ్రహాలను నిర్మూలిస్తున్నారు. ఓ బాపూ.....
రామరాజ్య స్థాపనకు సాధించితివి దేశస్వారాజ్యం కాని
దేశంలో నాట్యం చేస్తుంది ఆత్మహత్య చావుల రాజ్యం,
కపట స్వార్థ రాజకీయం
స్వాతంత్ర్యం వచ్చి అర్థ శతాబ్దం దాటినా
కడతేర్చబడలేదు సగటు మనిషి కడగండ్లు ! ఓ బాపూ....
దేశంలో వనితకు లభించుట లేదు సముచిత స్థానం మాన్యతా
అడపాదడపా మతకలహాలకు ఆటంకం లేదు
తృటిలో తమ తలరాతను మార్చుకొనుటకు ఆడుతున్నారు
ఎన్నెన్నో కపట నాటకాలు, దొంగనోట్ల తయ్యారి
దొంగ లాటరీ కంప్యూటరీ-ఇంటర్నెట్ హుష్కారీ. ఓ బాపూ...

ఇ.నెం.1-7-442, రెవెన్యూకాలనీ, సుబేదారి, హనుమకొండ-506 001 ఫోన్: 431468

# జిలుగువెలుగులు

**- రేగులపాటి కిషన్‌రావు**

కళాతృష్ణయె మనిషిపొందిన దివ్యవరమని తెలుసుకో
నవ్య సృజనను పెంచుకొనుచూ కళామూర్తిగ వెలిగిపో.

మనసు నిండుగ మమత నిండిన మనిషినెప్పడూ కలుసుకో
మధుర వాక్కులు పలికి చెలిమిని పెంచుకొనుచూ మసలుకో.

వెన్నుదట్టి ప్రోత్సహించు మంచి మనసు విరియాలి
వెన్నుపోటు పొడవుజూచు కుటిలగుణం విరగాలి.

మాట తీపి చాలదులే మనసు తీపి కోరదులే
తీపి మాట, చేదు మనసు చేరువైన బాధేలే.

ఇన కిరణం ఒకటి చాలు ఇరుకు తమము తొలగునులే
ఇహలోకం వెలుగు కొరకు వివేకమ్ము చాలునులే.

వెలుగు గుణములున్నవాడు వెలుగుపంచి వెలుగునులే
మనసునిండ తమముండిన మనిషి బ్రతుకు తమమేలే.

క్రాంతి కోరెడు కపోతములె శాంతి పతాకము నెగురవేయును
క్రూరమతిగల కుటిల డేగలు కపోతాలను కూల్చివేయును.

చేసినది చిరు పాపమైనను చిత్తశుద్ధిని చీల్చునోయి
అగ్నికణమది చిన్నదైనను పత్తిగుట్టను కాల్చునోయి.

అధముడు అందలమెక్కిన అవని నిండ బాధేరా
నీచమతికి చెప్ప నీతి, నీటిలోన రాతేరా.

పగబూనిన ఒక మనసును పగతో చల్లార్చలేవు
సరళ మతివి నీవైతే చెలిమి పెంచు పగను త్రుంచు.

కలలు నిజముకాకున్నను తీపి కలలు పెంచుకొందు
ఆలోచనచేసి మంచి కలను నిజము చేసుకొందు.

ఇ.నెం.10-1-216, సంతోష్‌నగర్, కరీంనగర్. ఫోన్: 08722-55912

# పన్ను పోటు

- శ్రీగిరిరాజు విజయలక్ష్మి

ఆటోలకూ, సైకిళ్లకూ

స్కూటర్లకూ, కార్లకూ

ఏ వెహికల్స్‌కైనా

పార్కింగ్ ప్లేస్ కల్పించ లేకపోయినా....

అక్రమ పార్కింగంటూ

విపరీతమైన 'పన్ను'పోటు ప్రజలకు

పట్నాలలో పోలీసుల ద్వారా

ఒక పద్ధతీ.... పాడూ లేకుండా

మంచేదో చేడేదో తెలుసుకోలేని

అయోమయస్థితిలో

నరులను తెగనరకటమే

అన్నల 'పన్నుపోటు' ప్రతి రాష్ట్రంలో

అన్నల బాధలు తట్టుకోలేక

పట్నాలకు బిల్డింగ్‌ల పనులకొస్తే

అక్కడ యజమానుల 'కామపు పన్నుపోటు'

ఆడవాళ్లకు

ఓ (అ)సామాన్య మానవుడా ?

యీ "పన్నుపోట్లు" నేపథ్యంలో

ఎటు నీ చూపు యీ చిత్రవిచిత్ర

చిత్రభానువత్సరంలో....

ఇ.నెం.6-3-785/1, అమీర్‌పేట, హైద్రాబాద్-500 016

# మూఢనమ్మకాలు విడనాడాలి !

- తుమ్మల రాములు

మనుషులు చేసిన బొమ్మలకు మహిమగలదని
మరీ మరీ మొక్కడం మన మూర్ఖత్వం
మూఢనమ్మకం !
మానవాతీతమైన శక్తొకటి
ఈ ప్రపంచాన్ని
నడిపిస్తోందనే భావన-ఆలోచన
మానవునికి తెలిసిన నిర్ణయమే-
అవుతుందంటారా యోచించండి !
తెలియని విషయాల్ని
తెలిసినట్లుగా ప్రకటించడం-
తేలని విషయాల్ని
తెల్సినట్లుగా ప్రకటించడం
తప్పడు జ్ఞానాన్ని ప్రచారం చేయడమే
సమాజాన్ని వంచించడమే !
మూఢనమ్మకాల్ని పెంచడమే !!
మానవ ప్రగతికి మూఢనమ్మకాలు అవరోధాలు
మూఢనమ్మకాలు విడనాడి
శాస్త్రీయ దృక్పథంతో
సత్యాన్వేషణకు నడుం బిగించాలి !
సమాజ శ్రేయస్సుకి నాంది కావాలి !!

గ్రా॥ హరిపురం, పో॥ కొలనూర్(ద.మ.రైల్వే), మం॥ ఓదెల, జి॥ కరీంనగర్-505 162

# చిత్రభానుకు చిన్న సలహా

- "రాధిక"

ప్రకృతి గర్భంలో

అపురూపంగా రూపుదిద్దుకున్న పూరేకు

అమ్మాయేమోనని తెలిసికోడానికి

వెళ్ళావు స్కానింగు వరకు

    ఆడపిల్ల అని తెలిసినా

    అనర్థానికి అందకుండా

    గర్భస్రావానికి బోకు

    తప్పించుకొని చివరకు

ఆంధ్ర దేశంలో అడుగిడిన చిత్రభానుకు

చిన్న సలహా

స్కాముల వలలో చిక్కకు

విషపు పాముల మెట్లు ఎక్కకు

కాముకులున్నారు వెళ్ళద్దు ఆ పక్కకు

బురద మామూళ్ళ అడుసు తొక్కకు

ఎప్పుడూ ఆందోళనతేకు-ఆనందాన్ని మాత్రమే తాకు.

డా॥జి.బి. రాజేంద్రప్రసాద్, 70-3-38, వైద్యనగర్, రమణయ్యపేట, కాకినాడ-533 005

# సద్భావతి

- "కిషోర్"

హాయిని గొల్పుచున్ భువినిఁయామని చేరెడు సంభ్రమంబునన్
తీయని భావనామృతము తీగెలు సాగెను పద్యధారలై
నా యెదనుత్సహించి పలు నాట్యములాడె; విషాదమేలనో
కోయిల సుస్వరంబులను క్రొత్తగ సాగెను మేలుకొల్పగన్ !

క్రమమును దప్పి కాలమును, కాముకుడయ్యెనరుండు, స్వార్థ భా
వము పరమార్థమయ్యె, మతవాదము హింసను నింపె భారతిన్,
సమతకు చోటులేదు, యలసత్వము నిండె సమాజమంతటన్
మమతలు మాయమయ్యె, ధనమాంత్రికుడేలు ధరిత్రియందునన్ !

కావలె భారతంబునకు క్రాంతులొసంగెడు వీరవిక్రముల్
కావలె నీతివంతులు నకల్మష నేతలు సంఘజీవులున్
కావలె బాధ్యతాయుతులు కార్యవిజేతలు దేశభక్తులున్
రావలె శాంతిదూతలిటె రమ్యప్రశాంత సుధారసంబులన్

కలతలు లేని కాపురము, కల్లలుగాని సదాశయంబులున్
అలసటలేని మానసము, వ్యాధియెరుంగని గాత్రసంపదల్
అలజడి లేని మార్గమును, ఆపద లేని సుసౌఖ్యకాలమున్
నిలకడ నుండు నర్థములుకాన్కలొసంగె డనంతశక్తియున్ !

లలిత మనోజ్ఞమూర్తి రఘురాము దయార్ద్ర విలోకనంబులున్
విలసిత శాంతి సౌఖ్య శుభవేదికలై మన జీవనంబులున్
కల కలలాడుచుండగ నఖండ ప్రమోద మరంద వృష్టితో
కలలు ఫలించు నీ నవవికాస వసంత శుభోదయమ్మునన్.

N.V.N. చారి, ఇ.నెం.2-11-387, విద్యారణ్యపురి, వరంగల్లు-506 009 ఫోన్: 438660

# భారతీయ పదాలు

- బాసిరి సాంబశివరావు

పెరిగి పెరిగీ మిత్తి
బాకి ఆయెను కత్తి
చంపె రైతును పత్తి
ఓ భారతీయ

ఎండలో తపియించె
వరదలేమో ముంచె
దేశమాయెను కంచె
ఓ భారతీయ

బ్రతుకుదెరువుకు పోటు
దేశ ప్రగతికి చేటు
అధిక సంతతి చేటు
ఓ భారతీయ

ప్రజలైనచో గొర్లు
వెలిగేరు లోఫర్లు
బాబాలే దేవుళ్ళు
ఓ భారతీయ

లేమి ఆరాటము
భూమి పోరాటము
బతుకు చెలగాటము
ఓ భారతీయ

రోగాలు నినుజేర
రోదించ నీ దార
తాగవద్దుర సారా
ఓ భారతీయ

గ్రా॥ ముప్పారం-నారాయణగిరి, మం॥ ధర్మసాగర్, జి॥ వరంగల్లు. ఫోన్: 550870

# నాడు - నేడు

**- వై. విజయలక్ష్మి**

పవిత్రమైన భారత దేశానికి
తలమానికం నాటి హిమాలయాలు
విదేశి దురాక్రమణదారులకు
దుండగులకు నేడవి ఆలయాలు

పవిత్ర గంగా జలాలకు, మునులకు
తపోధనులకు నిలయమైనవి నాడు
మతకలహాలతో మారణహోమాలతో
రక్తసిక్తమై రుధిర ధారలు చిందిస్తున్నవి నేడు

మల్లెలవంటి తెల్లని మంచు కొండలు
ముచ్చటగొలిపే వెండి కొండలు నాడు
కుళ్ళు కుటిల రాజకీయ కుతంత్రాల
కబంధహస్తాలలో బందీలు నేడు

మనసును మరిపించే సుందర దృశ్యాలతో
విలసిల్లినవి నాడు,
మనసుకు భయభ్రాంతులను కలపిస్తూ
తూటాలకు, మారణహోమాలకు మనుగడైనవి నేడు.

ఇ.నెం.2-7-309, ఎక్సైజ్ కాలనీ, సుబేదారి, హన్మకొండ-506 110 ఫోన్: 456637

# కవిత్వంలో మానవత్వం

- కందుకూరి లక్ష్మణమూర్తి

మనసులోని మంచియే మానవత్వం

మార్గదర్శక చేతనత్వం మానవత్వం

స్వార్థచింతన లేని తత్వం

మతాతీతం మానవత్వం

వర్గభేదం లేని తత్వం

కులాతీతం మానవత్వం

బీద-సాదలెరగని తత్వం

ధనాతీతం మానవత్వం

కూడబెట్టలేనిదీ తత్వం

కోరికలకతీతం మానవత్వం

కొనాలంటే దొరకలేనిదీ తత్వం

కొలమానాతీతం మానవత్వం

కలంలోని లేని తత్వం

కవిత్వంలో ఉంటుందీ మానవత్వం

మానవత్వం మనుగడలో

మురిపించే రామరాజ్యం కనిపించు

“మంచియన్నది నేస్తం అయితే-మరవబోకోయ్ దోస్తానీ”.

టీచర్, జెడ్.పి.యస్.యస్. (బాలురు), మం॥ పర్కాల, జి॥ వరంగల్లు-506 164

# చరిత్రలో విజేతగా నిలుస్తా

- ఇ. అయిలయ్య

చిత్రభానుగా వెలుగునిస్తా !
చరిత్రలో విజేతగా నిలుస్తా !!
నిత్యం సత్యాన్వేషణ సాగిస్తా !
నిష్ఠూరాలెన్నొచ్చినా భరిస్తా !!

అన్యాయం అక్రమాల నరికడతా
అందరి కోసం పోరాడుతా
బడి గంటలు కొట్టిస్తా
గుడి గంటలు మ్రోగిస్తా

బాలలకు మంచిని బోధిస్తా
భక్తులకు ముక్తిని వివరిస్తా
హిమగిరి శిఖరాలు చూపుతా
హద్దులు దాటొద్దని చెబుతా

జాతి కోసం రక్తమైన ధారపోస్తా
జాగృతికై అహర్నిషలు శ్రమిస్తా
లౌకికత్వం ముద్దు ముద్దని చెబుతా
లోకంలో యిది గొప్పని చాటుతా

విశ్వమాత ఒడిలో చేరుతా
విశ్వానికి మేలును కోరుతా
సస్యశ్యామలం, శాంతిని కోరుతా
సర్వ జగత్తులో భారతిని ముందుంచుతా

చిత్రభానుగా వెలుగునిస్తా !
చరిత్రలో విజేతగా నిలుస్తా !!

టీచర్, గ్రా॥ మర్రిముచ్చాల, మం॥ చేర్యాల, జి॥ వరంగల్లు-506 355 ఫోన్: 22540

# చిత్రభానూదయం

- మాడుగుల భాస్కరశర్మ

శాంతి కపోతధారిగ ప్రశాంత నిశీథిని జీల్చి కాంచన
భ్రాంతి సమైక్యతా మకుటభాస సమగ్ర రూప కేతన
క్రాంతి రథమ్ములోన నవరాజస మొల్కగ 'చిత్రభాను'దే
శాంతర సీమ దాటి నవశౌర్య పరాక్రమ జేరె నీభువిన్.

గుసగుసలాడె చెట్టు తన కొప్పనజేరు లతా సమూహమున్
మిసమిసలాడజూచి తన మేనును ప్రక్కకు వంచి మెల్లగా
శశికళవృద్ధిరీతి తన సన్నని చేతులు కాళ్లలోన బల్
కిసలయముల్ జనింప నవకేతనమై మధుమాసవేళలన్.

వచ్చెను 'చిత్రభాను' నవవర్ష యుగాది వనాంతరంబునన్
జొచ్చె, విశాలవృక్షముల సోయగమంతయు గాంచిలోకులున్
మెచ్చ, మయూర కన్యకలు మేనక యూర్వశిరంభలట్లుగా
ముచ్చటగొల్పు నాట్యములు మోదమునందుచు జేయుచుండగన్.

క్రొమ్మావి చిగురాకు కొమ్మలో దాగిన-కొమ్మనే కోరికెనో కోకిలమ్మ !
హర్షగీతము పాడె హావభావాలతో-కుహుకుహూ రాగాల కోకిలమ్మ !
భాషా విభేదాలు వలదంచునైక్య వా-క్కుల నాలపించెనో కోకిలమ్మ !
ప్రాంత వైషమ్యాల పాతగోడలనెల్ల-కూల్చగా బిల్చెనో కోకిలమ్మ !
నవ్య సామ్రాజ్య సౌభాగ్య దివ్యగాన-రాగడోలికలందనురాగ మొలికి
చిత్రభానూదయమ్ము విచిత్ర మలర-కోరె శాంతిని భారత కోకిలమ్మ !

కీర్తనము, గాయనము, గీతమ్ము, గేయమ్ము-పదము ప్రగీతమ్ము పలికె చిలుక !
కళ్యాణి, కేదారగౌళ శ్రీరాగమై-మురిపించె కలఘోష ముద్దు లొలుక !
శాంతి, సౌభాగ్యమ్ము, సఖ్యతకై 'జీలు'-తన ముక్కుతో పట్టె తమ్మికలిక !
మావి తన ముంగిళ్ల మదనుని రాకకై-చిందించెనందాలు చిగురులొలుక !
కోరి రాయంచ, శుకి, పాలగుమ్మ, చటక-సారసమ్ముల దివ్య సుస్వాగతముల !
భరత వనసీమ, హిమసీమ పదమునిలిపె-చిత్రభానూదయమ్ము విచిత్రమలర !

జవహర్ నవోదయ విద్యాలయం, మామునూరు, జి॥ వరంగల్లు-506 166

# నీవే ప్రశ్న అయిన చోట...

- సాదనాల వేంకటస్వామినాయుడు

నిర్బంధపు నీడలు వ్యాపించవచ్చు !
అది బంద్ కానీయండి, ధర్నా అయినా కానీయండి !
ఏ సమయంలోనైనా
బాధా వేదిక మీద గాయం ఉదయించ వచ్చు !
ఒక ప్రతి బంధకానికి కారణం ఏదైనా కానీయండి !
ఒక దౌర్జన్యానికి, ధ్వంసకాండకు
విషయం ఏదైనా కానీయండి !
అది అసౌకర్యమై, ప్రాణాంతకమై పరిణమించవచ్చు !
ఉన్మాదం కొందరి ఊపిరైతే-
ఉపేక్ష కొందరి జీవితమే కావొచ్చు !
జడత్వం ఊడల మర్రిలా జడలు చాచవచ్చు !
నిజం మొలకెత్తి నిటారుగా నిలవాలనుకున్న చోట
నిర్ధాక్షిణ్యంగా కత్తివేట్లు దేహమంతా ప్రశ్నించవచ్చు !
ప్రతి హృదయంలో కోటానుకోట్ల విస్ఫోటనలు జరగవచ్చు !
నరనరాల్లో చితిమంటల చిటపటలు వినిపించవచ్చు !
స్వేచ్ఛాపతాకం ఎగరాలనుకున్న చోట
అంతులేని ముళ్ళకంచెలు విస్తరించవచ్చు !
నీ మౌనం అర్ధాంగీకారం మాత్రమే కాదు-
పూర్ణాంగీకారం కావొచ్చు !
అందుకే మూగజీవిగా మరణవేదనను వినిపించకు
మౌన సమాధుల్ని చీల్చుకుంటూ
మొలకెత్తే హరిత ఖడ్గానివై కదలిరా....
బదులుగా నిబద్ధత నిన్ను నిలువెత్తు మనిషిని చేస్తుంది.

ఇ.నెం.6-3-107, బ్యాంకు కాలనీ, ఖమ్మం-507 002  ఫోన్: 08742-21051

# విఫల యత్నం

- రాపర్తి శంకర్

వచ్చింది వచ్చింది

వర్తమానం

కావాలనుకుంటుంది

అస్తమానం నా నేస్తం

నా జీవితాన్ని

చిగుర్చాలని తాపత్రయం

ఆ ప్రయత్నం చేస్తుంది క్షణక్షణం

నాకు మాత్రం గుర్తొస్తుంది

గడిచిన ప్రతి క్షణం

అది నాలో మండే అగ్నికణం

మరువలేను నేనా అనుభవం....

నీవు మార్చాలని ప్రయత్నించినా

నేను మారలేను

ఓ వర్తమానం

అందుకు నన్ను క్షమించు ఓ నేస్తం

ఒకటి మాత్రం గుర్తుంచుకో అస్తమానం

కాకూడదు నీవెవ్వరికి

బాధాకరమైన గతం.

# ఢిల్లీ కంటే నా పల్లె నయం

- దార్ల రామచంద్ర

ఎటు జూసినా జనారణ్యం
ఎటు పోదామన్నా రోడ్ల వెంట వాహనాల పరుగు పందెం
పైన పటారం లోన లొటారంలాంటి ఈ ఢిల్లీ
నీకంటే నా కన్నతల్లి పల్లే నయం
నిలువ నీడలేని బతుకులని
బతికుండగానే సమాధిచేసి
ఎకరాలకెకరాల భూమి సమాధుల పేర
సమాధైపోయింది.
లక్షలమంది శ్రమశక్తిని
ఏళ్లఏళ్ళు రాళ్ళుగామార్చి
శ్రమైక సౌందర్యానికి నాందిలా నిలిచిన కట్టడాలు
ప్రజల పీడించి కట్టిన రాజుల అహంకారం రాలిపోయినా
కోటల శిథిలాలు విహారయాత్రల బాటలై మిగిలాయి
జనం తిండి దొరకక రాలిపోతుంటే చూస్తూ
రాజ్యం ఫిడేలు మత్తులో
కత్తుల సంగీతం వాయించిన ప్రభువులు
తాజ్‌మహల్, ఎర్రకోట, పార్లమెంటు
కట్టించిన వాళ్ళు కాదు.... కట్టిన వాళ్ళే గొప్ప.

తెలుగు లెక్చరర్, APSWRJ College, హుస్నాబాద్-505 467 జి॥ కరీంనగర్

# దేశభక్తి

- ఆడెపు చంద్రమౌళి పండిట్

భరత భూమి యువకుడా
భావి రైతు సోదరుడా !
నవభారత సైనికుడా
నవ్యశక్తి శోధకుడా !

స్వాతంత్ర్యపు రాజ్యమురా
సకల మార్గదర్శమురా !
గణతంత్రపు దేశమురా
గణుతికెక్కి సాగుమురా !

జగతి రథమును నడిపించుమురా
ప్రగతి పథమున పయనించుమురా !
భరత ఖండమిది దివ్య భూమిరా
భావి జాతికిది భవ్య చరితరా !

సమసమాజ నిర్మాతగ నిలువుమురా
సమ భావన నిర్ణేతగ మెదలుమురా !
భరత ఖండమిది దివ్య భూమిరా
భావి జాతికిది భవ్య చరితరా !

మానవత్వ విలువను కొనియాడుమురా
దానవత్వ దర్పం విడనాడుమురా !
భరత ఖండమిది దివ్య భూమిరా
భావి జాతికిది భవ్య చరితరా !

తెలుగు పండిట్, ప్రభుత్వోన్నత పాఠశాల, మం॥ చేర్యాల-506 223 జి॥ వరంగల్లు

# మనమ్

- నమిలికొండ బాలకిషన్‌రావు

అది విశాలమైన చతుశ్శాల భవంతి !!

ఇంటి చుట్టు పచ్చని తోటలు, పాడిపంటలు,

ఎన్నెన్నో విచ్చిన పూల వరుసలు

చిన్నారుల కేరింతలు, నవయువకులకో క్రీనీడలు

పండిన పంటలు ఇంటికి తెచ్చె పెద్ద కచ్చరం

ఆపై చిన్న కచ్చరంలో యువకుల-యువతుల పరుగు పందాలు

ఇటు ఉషోదయం బంగారు ఛాయలు

అటు సంధ్య, గోధూళి వేళకాంతుల్లో-ఆపై వెన్నెల వెలుగులు

ఆ ప్రకృతి శోభ మధురానుభవం

ఆపై ఇసుక మైదానాల్లో

పిల్లలు, పెద్దలు, ఆటపాటల్లో ఎంత మధురం !

ఆకాశవాణి పంట పొలాల నుండి మధుర పాటల వరకు

మరెన్నో న్యాయాన్యాయాల గోష్టుల-వీనుల విందు

సరిగమపదనిస గాత్రాలు మరవరానివి-మరిచిపోనివి.

* * * * *

ఒక పెద్ద భవంతి ముంగిట్లో-సపరివార కుటుంబం

సత్ జీవనానికి పునాదులు

అమ్మమ్మలు, నానమ్మలు, తాత మనుమలు

మరెందరో ముని-ముని మనవల వరసలు

ఓ సంక్రాంతి-

మరో బతుకమ్మ పండగ, దీపావళి, సరదా సంబరాలెన్నో

కలలు పంచుకొనే కుటుంబం.

మరెందరో అత్తలు అమ్మలై

కోడళ్లై సుఖశాంతుల కుటుంబం

అత్తల పెత్తనాన్ని-సూటిపోటి మాటల్ని

కూతుర్లుగా కోడల్ని, కోడళ్ళు అమ్మలుగా భావించి
అనురాగాన్ని పంచుకునే కుటుంబం
లెక్కకు ముప్పది నుండి పిల్లలతో యాబది
ఎంత పెద్ద 'సు'-పరివారం
యావత్ ఆత్రుత పరుగులు
ఆపై సద్దుమణిగి పారిపోయిన రోగం
వైద్యోనారాయణ సేవలు
ఇంట్లో ధన, ధాన్య రాశులు-సమిష్టి కృషి నిధులు
ఇంట్లోకి ఏ అతిథి వచ్చిన-అదొక విశ్రాంతి గృహం
ఇంటి ముందు ఏ బిచ్చగాడు వచ్చిన
అదొక ఆకలి పారద్రోలిన వాకిలి
అందుకే ఆదర్శం-ఆ ఊళ్లో మరో కుటుంబం
ఉన్న నల్గురు నాల్గు భాగాలే
నిత్యం ఏదో ఒక వాదం-విభేదం
ఇంటి నుండి రోదాల రోదనలే
శాంతికి విశ్రాంతికి
ముందు 'ఆ' అశాంతి బోర్డు వ్రేలాడుతుంది
ఊరికి పెద్ద మోతుబరి రైతు
ఆ పెద్దాయన కుటుంబం
నేడు మరో రైతుకు కూలీ లైయారు
విచ్ఛిన్న కుటుంబం
చింతలున్న చిన్న కుటుంబం-ఏకాకిగా మిగిలిన కుటుంబం
అందుకే సమిష్టి కుటుంబం-సంతోషాల నిలయం
అదో న్యాయస్థానం
అది న్యాయ వ్యవస్థకే చిహ్నం.

ఇ.నెం.6-7-61, రాగన్నదర్వాజ, హన్మకొండ, జి॥ వరంగల్లు-506 011 ఫోన్: 447407

# శ్రీమత్ చిత్రభాను నామ సంవత్సరాహ్వానము

- మంథెన ఆండాళ్

ఉ. శ్రీనిలయంబుగా నిలకు శ్రేయముగూర్చెడు, నీలవేణి ! శో
భానలినాయతాక్షి ! మృదుభాషిణి ! దివ్యతటిల్లతాంగి ! స
మ్మానిత ! సత్వరూపగుణమండిత ! నిర్మల తేజ ! చిత్రభా
నూ ! ననుగన్న తల్లి ! సుమనోహర ! రావె దయా పయోనిధీ.

ఉ. అరువది యేండ్లనాడు నను అక్కున జేర్చిన దానవీవె, నా
కిరవుగ జన్మనిచ్చి తగ నింపుగజూచిన దానవీవె, సాం
పరయగ శైశవ క్రియల హర్షము నొందినదాన వీవికన్
అరువది యేండ్లు నాకిపుడు, అమ్మరో ! చూడగవచ్చి నావటే.

ఆ.వె. వత్సరంబ ! అంబ ! వాత్సల్యమునుజూప యేగుదెంచినావు, స్వాగతంబు
కాంచితమ్మ నన్ను కవయిత్రిగా, నీదు కనుల చలువ వలన గాదె తలప.

సీ. కలముపట్టగ నేర్చి కావ్యాలు వ్రాసితి । రసికులు మెచ్చగా రహినిమించి ।
పద్యకావ్యాలుగ పరగెను పదమూడు । వైవిధ్యముగచాల వరలె భువిని ।
రేడియో టీవీల లీలగా చదివితి । చాల సభలలోన పాలుగొంటి ।
మెచ్చిన సన్మానాలు మేదిని సలిపిరి । పలుచోట్ల గొప్పగా పరిగణింప ।

తే.గీ. తల్లి దీవెనలివ్వవే తలిరుబోణి । మరల నీరాకవరకు నన్ మనిచియున్న ।
వృద్ధగుణవృద్ధనై నే సమృద్ధిగాను । వ్రాతు నీపైన పద్యాలు వాంఛతోడ ।

ఉ. తేజమునందు నిన్ను గణుతింపగ నేరికి సాధ్యమమ్మ ! ని
ర్వాజ మనీషవై జనుల రక్షణ చేయగదమ్మ ! శాంతితో
నీ జగమంతనుండగ నయేతర శక్తులద్రుంచి, భద్రతన్
రాజిల జేయవమ్మ ! గుణరాజిత ! పూజిత ! నవ్య వర్షమా.

ఇ.నెం.1-560, గాంధీనగర్ వీథి, మం॥ నర్సంపేట, జి॥ వరంగల్లు.

# నేటి విద్యా విధానం

- జి. రవిప్రసాద్

మేమూ పిల్లలమే ! .....

అభం, శుభం తెలియని చిన్నారులం

విరిసీ విరియని పసిడి మొగ్గలం

అమ్మ ఒడిలో హాయిగా నిద్రపోయే

పసి హృదయం మాది.

కానీ మేము విధి చేతిలో కీలుబొమ్మలం

అర్ధరహితమైన చదువులు

మోతకు మించిన బరువులు

రోజూ.... రోజూ..... మోసీ...... మోసీ.....

భుజాలపై పడిన గాయపు గుర్తులు

ఆడుతూ... పాడుతూ గడపాల్సిన

మా జీవితాన్ని......

కుప్పలు తెప్పలుగా కృత్రిమత్వపు చదువును

ప్రోగు చేసి....

మా చిన్న మెదడుకు

నిరుపయోగమైన అంశాలను

మా బుర్రలో త్రోసి....

మమ్మల్ని గందరగోళంలో పడవేస్తారు

సృజనాత్మకతతో వికసించాల్సిన మా మేధస్సును

సుడిగుండంలో వేస్తారు-ఇదెక్కడి న్యాయం.

ఇ.నెం.16-18, సుభాష్‌నగర్, వనపర్తి, జి॥ మహబూబ్‌నగర్-509 103

# కర్మయోగము

- సూర్యదేవర సుందరయ్య

తే.గీ. కర్మజేయని నే జీవిగానరాదు
మంచి కర్మలయందున మనసు నిల్పి
చేయ నిష్కామ కర్మను చేయునెడల
యజ్ఞమేనగునది భూమి నాలకించ.

తే.గీ. శాస్త్ర నియతములగు కర్మ సంతరించి
ఫలమునాశింపకుండగా పనులుజేయ
పరమపదమగు మోక్షంబు బడయగలవు.
అంబరీషుడు, జనకుడు యట్టివారె.

తే.గీ. రాగద్వేషమ్ములుడిగిన భోగముడుగు
కామమొక్కటి వదలిన గలుగు జయము
సాక్షిగానున్న యాత్మను చక్కగెర్గి
మనసు నిల్పుటే మోక్షంబు మాన్యులార.

తే.గీ. కర్మ, జ్ఞాన మార్గాలలో కర్మమిన్న
కర్మ త్యాగము చేసిన కాలమందు
జనులు మోక్షంబునందేరు జగమునందు
జ్ఞానహీనులు చెడుబుద్ధి నొందగలరు.

తే.గీ. కర్మలందున జ్ఞానంబు గల్గియున్న
తనకు మేలును గూర్చియు ధరణియందు
చెప్పలేనంత మేలగు చింతలుడిగి
భూమిపై వింతలుండవు పోరులుడుగు.

Retd. Gazetted H.M., మం॥ పర్కాల, జి॥ వరంగల్లు-506 164

# కష్ట జీవుడా... ఓ కార్మికుడా...

- మాసు రాజయ్య

నీ శ్రమకు ఫలితం దోపిడీ-నీ కష్టానికి విలువ కన్నీళ్ళు
కడుపు నిండా తిండి దొరకక-అర్ధాకలితో అలమటించేవూ,
కడుపాకలి కట్టుకోనీ
కష్టజీవివై కాలం గడిపేవు
రాత్రిపగలనక నిద్రాహారాలుమాని
కార్మికుడి విధులను మీదేసుకొని
రెక్కలు ముక్కలు చేసి సేదతీరక చేమటోడ్చి-
బ్రతుకీడుస్తావు బ్రతుకు భారంగా
చీకటిబారిన బ్రతుకులలో
వెలుగులు నింపే దిక్కెవరో-
అనుక్షణం ఆరిపోయే దీపంలా
కాంతినిస్తూ కరిగిపోయే క్రొవ్వొత్తిలా
ఇంకెన్నాళ్ళు... ఈ బానిస సంకెళ్ళు
పాలకవర్గాల నుంచి విముక్తి సంకేతాలు
కండలు కరిగించి స్వేదం నదులైన
కనికరించని కసాయి సర్కారు
కార్మిక, కర్షకుల హక్కులను కాలరాస్తు
కాలగర్భంలో కలిసిన హక్కుల సాధనకై
సాధించుటకు సమైఖ్య పోరాటమే శరణ్యం
అందుకే !
కార్మిక కర్షక మేధావుల్లారా కదం తొక్కుతూ కదలిరండి
కనికరం లేని కసాయి పాలనపై తిరుగుబాటు జెండా ఎగురవేసి
కార్మిక హక్కులకు రక్షణ సాధిద్దాం.

గ్రా॥ మం॥ చిట్యాల, జి॥ వరంగల్లు.

# ఆకలి అరుపులు

- రేపాక సంపత్ రెడ్డి

కనిపించదేది

పచ్చని ప్రశాంత పైరు తీరు !

వినిపించదేది....

జలజల పారే సెలయేరు !

వినిపిస్తోంది ఆకలి అరుపుల జోరు

ప్రకాశిస్తుంది స్మశాన వాటికల హోరు

ప్రజల నోట్లోకి లేదు నీరు

ప్రగతికి ప్రశ్నగా తెరిచింది భూమి నోరు !

ప్రపంచ బ్యాంక్ ఇస్తుంది అప్పుల జోరు

అది దేశ వ్యవస్థను దిగజార్చే తీరు !

దేశ వ్యవస్థ అస్తవ్యస్తముల పోరు !

అధికార నాయకుల అక్రమాలు జోరు.

గ్రా॥ కేశాపూర్, మం॥ హుస్నాబాద్, జి॥ కరీంనగర్. ఫోన్: 59138

# తెగులు సోకిన భారత సంస్కృతి

- నర్సింగోజు లక్ష్మయ్య

విశ్వమానవకోటిలో వినుతికెక్కిన
దివ్య భారతీయ సాంస్కృతిక ఔన్నత్యం
పాశ్చాత్య నాగరికత పాద తాడనలతో
దూరదర్శన్ ప్రచార సాధనాల సాక్షిగా
పవిత్రత కోల్పోయి, ప్రతిష్ట చెడుతుంది.

విదేశీ భావజాలాల ప్రచార పర్వాల
మతమౌఢ్యాల ప్రేరణలు, జాతుల వైషమ్యాల బోధనలు
అధికారంతో వ్యక్తుల అభిప్రాయ సాధనలు
భావశుద్ధి, చిత్తశుద్ధి లేని అనైతిక ఐక్యతలు
భిన్నత్వంలో ఏకత్వం కలిగిన భారత సంస్కృతిని
భ్రష్టు పట్టించి బజారులో నిలబెడుతున్నవి.

స్త్రీలు దేవతలుగా పూజింపబడిన పుణ్యభూమిలో
అసభ్య, అనాగరిక, అశ్లీల, వింతపోకడలు
ప్రబలంగా వ్యాపింపబడి, స్థిరపరచబడి
అభిమాన, మానాలను మంటకలుపుతున్నాయి
వినోదాన్ని, విజ్ఞానాన్ని అందించే వివిధ టి.వి. ఛానళ్ళు
పాపం పుణ్యం ఎరుగని పసిబాలల మనసులలో
విషసంస్కృతికి బీజాలు నాటుతున్నాయి.

మాయలు మంత్ర తంత్ర క్షుద్ర విద్యలు
విశేష కీర్తిని పొంది, మూఢ నమ్మకాలను పెంచుతున్నాయి.
ప్రజాభీష్టం అంటూ ప్రజాధనం దుర్వినియోగం అవుతుంది.
తరతరాల భారతీయ సంస్కృతికి తెగులు సోకుతుంది.

---

ఇ.నెం.7-115, అంగడి బజార్, మం॥ పరకాల, జి॥ వరంగల్లు-506 164

# నా కోరిక

- కె.ఎల్. కాంతారావు

నా దేశం నందనవనమై నిలవాలి
నా జనులందరు ఆనందంగా నవ్వాలి.
కావేరిని గంగానదితో కలపాలి
నేల నీరు ప్రజలందరికీ పంచాలి.
కుల మత భేదాలు సమసిపోవాలి
స్వార్థ నీచ బుద్ధులన్ని మాసిపోవాలి.
ప్రజలందరు ఒకే బాటపైన నడవాలి
నా జనులందరు ఒకే తాటిపై నిలవాలి.
వందేమాతరమంటూ గొంతులన్ని కలపాలి
మనదే కర్తవ్యమంటూ ఎలుగెత్తి పిలవాలి.
పాడీపంటల తోడను పల్లెలన్ని నిండాలి
పారిశ్రామిక వాడలు పట్టణాలు వెలయాలి.
అవినీతి, అంధకారమంతరించి పోవాలి
జాతిలోన నీతి పెరిగి వెలుగు నిండిపోవాలి.
నవ్యభరతమాత రూపు కన్నులార కాంచాలి
నా తనువప్పుడు నిశ్చింతగ ఎచటో రాలిపోవాలి.

Qtr. No. AE-5, A Colony, KTPS పాల్వంచ, జి॥ ఖమ్మం-507 115 ఫోన్: 55237

# ప్రేమ తపన

**- వేముల తిరుపతిరెడ్డి**

ప్రియా !

నా ఆశలకు ఆకృతి నీవు

నా జీవితపు జాగృతివి నీవు

నా ప్రేమ అమరం చేసిన అమృత మూర్తివి

నీవే ప్రియా !

నా జీవన

ప్రేమాయణ అలసట తీర్చిన

ఆత్మబంధువు నీవే

నా అన్వేషణకు

ఆరాధనకు

ప్రేమకు లభించిన పెన్నిధివి నీవే

ప్రియా !

ఇ.నెం.11-83/బి, కాకతీయ నగర్, హుస్నాబాద్, జి॥ కరీంనగర్. ఫోన్: 56575

# రోడ్లు మేల్కొని ఉన్నవి

- చెన్న వేంకటనారాయణ

రోడ్లు మేల్కొని ఉన్నవి
మృత్యువు మేల్కొని ఉన్నది
రోడ్లమీద మృత్యువు మేల్కొని ఉన్నది.
పొత్తిళ్లలో నిన్న పొదిగిన చిన్నారి
ఎంతో ఎత్తైన శిఖరాన నెక్కిన ధీశాలి
రోడ్ల బారినపడక తప్పదు మరి.
వరాలు పొందిన వాడైనా
వామనమూర్తియైనా
రోడ్లకు దండం పెట్టాల్సిందే !
ఏ లారీ ఎప్పుడు మృత్యు రూపం
దాలుస్తుందో ఎవరికి తెలియదు
ఏ తల్లి కడుపునూ కాల్చేస్తుందో
ఏ చెల్లి నుదుట కుంకుమను చెరిపేస్తుందో
ఏ పిల్లల్ని అనాధలుగా మార్చేస్తుందో
ఏ తరుణిని దివాలోకాలకు తరలిస్తుందో
ఎవరికీ తెలియదు.
తాగిన మైకంలో తూలి పడ్తున్న తారు రోడ్లు
స్టాప్ బోర్డు చేతిలో లేని ట్రాఫిక్ పోలీస్ హెడ్లూ.
జైలు నుంచి తప్పించుక వచ్చిన ఖైదీల్లాగా లారీలు, జీపులు, కార్లు-
యమభటులకు నిలయాలు-నరకానికి నిచ్చెనలు
యీ రహదారి రోడ్లు.

Z.P.S.S., గ్రా॥ గొర్లవీడు, మం॥ పరకాల, జి॥ వరంగల్లు.

# అటు-ఇటు

**- డా॥ కె.ఎల్.వి. ప్రసాద్**

ఈ దేశం నాకేమిచ్చిందని ?
ఈ దేశంతో నాకు పనేమిటని,
అనవసరమయిన ఆవేశంతో,
అక్కరకురాని ఉద్రేకంతో,
కుప్పిగంతులు వేసే'వాడు'
ఆలోచించనే ఆలోచించడు.
ఈ దేశానికి తానేమిచ్చాడోనని
విశ్లేషించి చూడనే చూడడు.
ఈ దేశంలో తన పాత్రేమిటోనని
కష్టించి పనిచేయలేని 'వాడు'
క్రమశిక్షణతో మెలగలేని 'వాడు'
తన 'సాపాటు'వంతయినా
సంపాదించుకోలేని పరమ దరిద్రుడు !
దేశదిమ్మరియై తిరుగుతుంటాడు.
తనకీ దేశం ఏమిచ్చిందని ఘనంగా మొరుగు తుంటాడు.
ఊహకందని పల్లకినెక్కి ఊరేగుదామనుకుంటాడు
ఎదుటివాడి రక్తం కళ్ళజూసయినా
పరమాన్నం ఆరగిద్దామనుకుంటాడు
సమాజానికి కావలసింది ఇలాంటి వాళ్ళు కాదిప్పుడు
పగటి కలలిక మానేసి-చీకటి తెరల వెనుక నుండి
వెలుగు రేఖల్లోకి చొచ్చుకుపోయే
వెన్నెముకగల 'యువత' కావాలిప్పుడు
కులమతాల కుళ్ళును కడిగేసి
వేర్పాటువాదుల సరిహద్దులను చెరిపేసే
సహృదయ-సమాజం కావాలిప్పుడు
రండి, రండి, రండి-సమసమాజ నిర్మాణంలో
సమతా స్తంభాలమై నిలుద్దాం రండి.

---

రామకృష్ణా కాలనీ, సహృదయ మార్గ్, హన్మకొండ-506 004 ఫోన్: 432098

---

# నీ బాటలో...

- వై. శ్రీమన్నారాయణమూర్తి

ధృవతార వీరుని వర నుండి తీసిన ఖడ్గములా
పృథ్విపై రాలిపోయింది
దండోరా చప్పల్లు కావు-అవి జనార్ధనుని రణఘోష నినాదాలు
గిరిజన, హరిజనవాసుల హృదయాలలో నిలిచిన నీవు
హఠాత్తుగా స్వర్గసీమను అలంకరించినావా
పల్లె పల్లెలో నీవు ప్రయాణించిన నేల తల్లీ (రహదారులన్నీ)
నా బిడ్డ ఏడని ప్రకృతిని ప్రశ్నించుతున్నాయి.
ప్రజల హహాకారాలు
మా జనార్ధనుడేడని దిక్కులను అన్వేషిస్తున్నాయి
నీ వార్త రాని రోజులేని వార్తా పత్రిక
ఈనాడు కంప్యూటరు మీద మీ పేరు వెదుకుతున్నాయి
నీ ఉపన్యాస ప్రవాహ వాహిని ఏ పర్వత లోయలలో
తపస్సు చేస్తున్న మృత్యు జహ్నుడు కబళించి వేసెనా ?
వినాయకుడు పాలు త్రాగడనే విషయం
ఎంత వేగంగా విస్తరించిందో తెలియదు, కాని....
నీ గుండె చప్పడు నిశబ్దం అయ్యిందనే వార్త
విశ్వ ప్రపంచానికి తెలిసినది.
మాటకోసం నీ రాకకోసం ఎదురు చూసే మా చూపుల్లో
బాష్పాంజలిని నింపి అనంత లోకాలకు పయనించినావు.
నీ జాతి శ్రేయస్సు కోసం నిరంతరం శ్రమించి పోరాడే
మా జనార్ధన్ని లక్షలమంది సమక్షంలో అదృశ్యం చేశారా !
ఇది మీకు న్యాయమేనా ?
మీ ఆశయాలను వాడిపోనీయకుండా
నీ ఉద్యమాలను నీరుకారి పోనివ్వకుండా నీ బాటలో....

---

తెలుగు లెక్చరర్, మం॥ పరకాల, జి॥ వరంగల్లు-506 164

---

# చిన్న కల నిద్రలేపింది

- పల్లె సీను

నిరంతర కాల-"కలిమథనం"లో
నిర్లిప్తం తెలియకుండా-నిష్కర్షగా నిన్నటి "వృష" పరుగులు పెట్టింది
ఆద్యంతమూ అలజడుల్లోనే సర్దుకుంది.
శ్వేతప్రాంగణంలో-ఛిద్ర ధ్వని శకలాలు
వృద్ధ సంబరాల్లో-ఊర్పులు మిగిల్చిపోయాయి.
నీలాకాశం నిప్పులు చెరగడం-మొదలయ్యింది...
స్నేహసౌధపు శిఖరాలు-హద్దులు దాటి కూలడంతో
విశ్వాంతరాళమంతా-ఉగ్రవాదం గర్జన చేసింది.
మానవ మారణహోమం ప్రజ్వరిల్లింది.
ఉన్మాదం మహమ్మారిలా-ఊరూరూ కబళిస్తుంటే
అమాయకం బలియౌతూ-ఉదాసీనంగా వుండిపోయింది
ప్రతి పూటా-ప్రతి రోజూ.... ఉదయభానుడుదయిస్తూ
గంభీర ప్రయాణం సాగిస్తున్నాడు-గతులు మారుస్తూనే ఆలోచిస్తున్నాడు.
"అనంత సృష్టికి-ఆహారం మాటెరుగుదును !
ఆది మానవ జీవనాకృతి నెరుగుదును !
అనావృష్టికి ఆచ్ఛాదనం మాటెరుగుదును".... కాని
"అణుబాంబు ధర్మవర్తనమెట్టిదో ! నేటి మనిషి-
ఆత్మీయతా స్తుతి మార్పులెట్టివో !
అగమ్య గోచరమేనని" - హడలి పోతున్నాడు.
పశ్చిమాద్రికై పయనిస్తూ-విచిత్రంగా నాకేసి చూసి ;
వేలు గురిచూపి-మొహం చిట్లించి వెళ్ళిపోయాడు.
చిమ్మ చీకట్లు కమ్మాయి-చిన్న కల నన్ను నిద్ర లేపింది.
చిరుకాంతిని..... చిరు కలశంలో నింపి
"చిత్రభాను" చిరుశాంతిని ప్రసాదిస్తాడని.... చిన్న కల నిద్ర లేపింది.

ఇం.2-1-14, సరస్వతీ నగర్, విద్యారణ్యపురి, హన్మకొండ-506 009 ఫోన్: 438553

# మేల్కొలుపు

- గుర్రపు సత్యనారాయణ

చాలు.... ఇక చాలు.... లే.... ఇకలే.....

మేలుకో.... ఇకనైనా మేలుకో....

చైతన్య శంఖారావం పూరించు....

నీవు తెలంగాణా అమాయకుడివని

నీ నోరు నొక్కారు-ఊరుకున్నావు !

నీవు అజ్ఞానుడవని

నీ కడుపు కొట్టారు-సహించావు !

నీవు అవివేకుడవని

నీ శ్రమను దోచుకున్నారు-భరించావు !

నీవు అసమర్థుడివని అవహేళన చేశారు !

ఏమీ చేతకాని నిస్సహాయుడిని చేశారు !

ఒక్కసారి ఇటువైపు చూడు....

విషం తాగి ఆత్మహత్య చేసుకున్న చేనేత

కార్మికుడి శవాన్ని చూడు.....

ఉరి వేసుకుని చనిపోయిన పత్తిరైతు

అనాథ కుటుంబాన్ని చూడు....

సాగునీరు లేక, సరిపడు కరెంట్ లేక

ఎడారులైపోతున్న పంటలను చూడు.....

ఆరుగాలం కష్టపడి, చెమటోడ్చి పండించిన

ధరలేని ధాన్యాన్ని చూడు....

కొనే నాథుడు లేని రైతన్న దైన్యాన్ని చూడు....

కడివెడు తాగునీరు కోసం కడుదూరం వెళ్తున్న

నీ తల్లి కడగండ్లను చూడు....
తలదాచుకునేందుకు గూడు లేని
బక్కచిక్కిన
నిరుపేద బతుకులను చూడు....
పనిపాటాలేక నిర్వీర్యమైపోతున్న
యువతరాన్ని చూడు....
విరిగే లాఠీలకు భయపడకు
పేలే తూటాలకు వెనకడుగువేయకు
ఎదురు కాల్పులకు జడుసుకోకు
కెరటంలా రొమ్ము విరుస్తూ
వీరుడివై, శూరుడివై కదనరంగంలో దూకు.
విజయమో, వీరస్వర్గమో తేల్చుకో
నీవు నిరంతర సంఘర్షణాజీవివి-
ఏ ప్రలోభాలకూ లొంగకు !
ఎంతగా మబ్బుల్లో తడిసినా
సూర్యుడు వెలిసిపోడు
ఇక్కడ ఇప్పుడు ఏదీ తప్పు కాదు
ఒక్క ఆకలి తప్ప
ఆరని నిజం తప్ప
నిలదీసే ప్రశ్న తప్ప
తిరగబడే చైతన్యం తప్ప !

# ప్రేమ... ప్రేమంటే

- మారగాని రాంబాబు

ప్రేమ
లవ్
ప్యార్....
పలు పేర్లతో పిల్చినా
భావం ఒకటేగా
అతడు-ఆమె 'ప్రేమ'
'ప్రేమ' పెదవుల కలయికా !
మనసుల కలయిక
ప్రేమకు పెళ్లి పరాకాష్టా ?
పరాకాష్ట పెళ్లయితే
తర్వాత ప్రేమ ఒకటేనా !?
మరి ముందున్న ప్రేమ కొనసాగదేమో !
అది మరో పేరుతో-మార్పుతో
ప్రేమ శాశ్వతమే జీవితంలో కాదుగా
అది అందమైన-అద్భుతమైన భావన
ప్రేమించడం ఒకరికొకరు పంచడమేగా
అపార్థమెందకూ !
ప్రేమ నింపుకుంది
ఆరారు కాలాల అందాల్ని అనుభవాల్ని
ప్రకృతిలాగే ప్రేమ అనిర్వచనీయమైంది
అభివర్ణించలేనిది.
ఇదంటూ ఖచ్చితంగా !
అనుభవానికే తెలుసు ప్రేమంటే.... !

శ్రీసరస్వతీ B.Ed. కాలేజి, Opp. నేషనల్ పార్కు, జి॥ అనంతపురం-515 004

# పరుగో పరుగు

- "హనీ"

Nibbles (నిబుల్స్) నిదురలేకుండా చేస్తున్నాయ్...

Bytes కందిరీగల్లా కుట్టి కుట్టి చంపుతున్నాయ్...

ఏదో సాధించాలన్న తపన-

మరీ వేగంగా పరుగెత్తే

గ్లోబల్ విల్లేజ్

కాంపిటీసన్ కావేరిలో కొట్టుకుపోతున్నా-

ఈ Hi-Tech ఆలయాల్లో

అంతా టెన్షన్,

కాసేపు కళ్ళు మూస్కుంటే

చీకటే తప్ప-ఏమీ మిగలదు.

చీకట్లో బ్రతకలేను-

నుంచొని నీల్లు త్రాగలేను-

పరుగో పరుగు.

ఎక్కడకో అందరూ వెళ్తున్నారు.

గొర్రెనై నేనూ పోతున్నాను.

·నుమాన్, Qr.No. E-54, B-Colony, KTPS పాల్వంచ, జి॥ ఖమ్మం-507 115

# రామా ! రామా ! రామరామ !!

- పల్లేరు వీరస్వామి

రామరామ రఘురామ పరాత్పర, లోకంతీరే మారెనయా !
మర్కట రక్కస మారణ యుద్ధాల్, నాడూ నేడూ మారవయా !!
తండ్రి మాటకై సుఖాల విడిచీ తరలెను రఘుపతి నాడడవీ !
తిండీ తిప్పలు తీర్చే విధాన, దారిజూపేది నేడడవీ !!
మాట నిలుపు మాన్యంబగునని, బాదల గాధలు ఆనాడూ,
మాటల, ముఠాల హైటెక్ అప్పుల, విధాన పాలనలీనాడు !!
రామా ! రఘుకుల సోమా, మెజార్టి ప్రజల మాటలను విననేమి ?
మైనార్టీలను మన్నిస్తావు, ప్రజాస్వామ్యమే తెలియదుగా !
చిన్నమ్మ కోర్కె తీర్చటానికై, కన్నవారినేడ్పించావూ,
తరుణీ తమ్ముడు సుఖాలనొదలగ, అడవి అక్కునే జేరేవు.
ఒకేఒక్క అర్ధకుడంటే-సీతమ్మకు వనవాసాలా ?
రక్కసి మూకలు చుట్టుముట్టితే-శీల పరీక్షలు, శిక్షలా !
గుడికట్టించిన గోపన్న గోడు-వినలేవా ! కనబడలేదా
నీ గుడి ఏలని నిగ్గదీసినా, పరమతస్తునికి ప్రత్యక్షంబా ?
ఏమయ్యిందని శబరి ఎంగిలిని, ఎంతో హాయిగ తిన్నావూ-
ఏమవుతాడని గుహుని దీవించి, జన్మ ధన్యతనుజేసేవూ-
'రామా'అన్నంతనె హనుమన్నకు, గుండెలో కొలువై ఉంటావూ-
గుండెనే గుడిగజేసే ఋషులకు దండిగ మోక్షాలిచ్చేవూ-
కానీ, నేడు, నీతో-నేను
ప్రభూ మర్యాదగా వేడుకుంటున్నా ! ఇప్పటికైనా సెలవీయి,
నీ పేరిట గుడి కట్టుకుంటాం.... టాం, టాం......
ఎంచక్కా కొట్టుకుంటాం-ఓట్లను రాబట్టుకుంటాం
పదవి దొరికితే-తిరికుండదు
ఇప్పుడైతే తల్చుకుంటాం..... టాటా.

ఇ.నెం.3-305, మల్లారెడ్డిపల్లి వీథి, మం॥ పరకాల, జి॥ వరంగల్లు-506 167 ఫోన్:41060

# జాగ్రత

- "ఎమ్మెస్సార్"

మొగుల్లారా ! జాగ్రత
ఎం.ఎల్.ఏ. మొగుల్లారా ! జాగ్రత
మీరు హఠాత్తుగా చస్తే
మీ వాళ్లకే టికెట్లు
సానుభూతి పవనాలతో
స్థానాలు పదిలం.
మొగుల్లారా ! జాగ్రత
ఎం.ఎల్.ఏ. మొగుల్లారా ! జాగ్రత
టూత్ పేస్టులో విషం
బ్రేక్ ఫాస్టులో విషం
కన్ను మూస్తే కర్ణంలో పాదరసం
ఏ క్షణంలోనైనా బుల్లెట్టు
మీ గుండెల్లో దూసుకుపోవచ్చు
ఇంటి దొంగ ఈశ్వరుడికైన తెలీదు
పసుపు కుంకాలకన్నా
పదవులే నిజంగామిన్న
ఎం.ఎల్.ఏ. మొగుల్లారా
ఆదమరిస్తే ప్రాణం గోవిందా
జాగ్రత ! జాగ్రత !!

# టి.వి. డబ్బ

- శ్రీదాస్యం లక్ష్మయ్య

తాదూర సందు లేదు మెడకో డోలన్నట్లు
ఇంట్ల లొల్లి కగ్గితల్ల
ఒక పట్టువట్టి టి.వి. డబ్బ కొనిపిచ్చిండ్రు
దీనింట్ల పీనుగెల్ల
ఇంట్ల ఏమంట అడుగుపెట్టిందో
ఇల్లంత ఆగమైపోయింది
కొబ్బరికాయగొట్టి సుచ్చానుజేసిన కాన్నించి
ఇంటిల్లిరాజులు పండుగజేసుకుంటుండ్రు
పగలు గదే - రాత్రి గదే
తిండితిప్పలు దాని ముందట్నే
పక్కలుగూడ దాని పక్కనే
కండ్లు దానికే అతుకు పెట్టుకుంటుండ్రు
పొల్లగాండ్లు సదువు అటుకులెక్కించిండ్రు
టి.వి. డబ్బ కాలు పెట్టినకాన్నించి
పనులు పాతరపడ్తానయి
సదువులు సట్టుబండలైతానయి
ముచ్చట్లు కరువైతానయి
మనసుపెట్టి మాట్లాడుడు ఖతం
ఒకల్నొకలు తెల్సుకోవాలనే జాసుండదు
ఏడ్పుగొట్టు సీరియల్లు ఎగబడి సూసుడు
ఎకిలి చేష్టల గెంతులాటలు సుత
చానల్లు తిప్పడు కాలం గడుపుడు
అబ్బో పిచ్చెక్కిపోతోంది
బాంబు కొనుక్కున్నంత పనయితాంది
నడింట్ల దాచుకున్నట్లు భయమయితాంది.

ఇ.నెం.11-73/2, హన్మకొండ రోడ్, హుస్నాబాద్-505 467 జి॥ కరీంనగర్.

# దినం... దినం... క్షణం... క్షణం...

- డా॥ కొదమసింహ్వాం క్రిష్ణమాచార్యులు

దినం... దినం
        ఎదుగుతోన్న నేటి విజ్ఞానం
        వెదుకుతోంది రేపటి అజ్ఞానాన్ని
క్షణం... క్షణం
        పెరుగుతోన్న నేటి నాగరికం
        దిగవిడుస్తోంది దీక్షిత సమాజాన్ని
క్షణం... క్షణం
        నిండుతోన్న నేటి స్వార్థ హాలాహలం
        వెక్కిరిస్తోంది నీ... నా సౌభ్రాతృత్వాన్ని
తరం.... తరం
        అనుసరిస్తోన్న నేటి జీవన విధానం
        విప్పి చెబుతోంది నీ... నా అంతరాన్ని
వాదం.... వాదం
        అయోధ్య రాముడు నేటి ఆరాధ్య దేముడు
        రాములోర్ని జన్మభూమిలో ఉంచాలా వద్దాని
తధ్యం.... తధ్యం
        నమోనమామి కర్మభూమి ఈ దేశం
        పురాణ పురుషుడి ధర్మం స్థాపించడాన్ని
నిత్యం.... నిత్యం
        నవోన్మేష చైత్రాదివసంతాది కాలం
        మారుతోంది కొంగ్రొత్త చిగుర్లు వేయాలని
మనం..... మనం
        పరమోన్నత సంస్కృతి వారసులం
        ప్రగతితో నడపాలి దేశీయ దివ్య రథాన్ని.

నెం.2-7-436, ఎక్సైజ్ కాలనీ, సుబేదారి, హన్మకొండ-506 001 ఫోన్: 457559

# కళలు

- జి.జె. ఇమ్మానియేలు

కళలు

కళల కోసం కాకుండా

సమాజ శ్రేయస్సుకు

సహకారం అందించాలి

కుంచె పట్టి గీసిన ప్రతి చిత్రం

ప్రజలనుత్తేజ పరచాలి

ప్రపంచంలో

దేన్నైనా కొనగలమెమో కాని

కళలను కొనలేము

విలువ కలిగినది

వెలలేనిది నిజమైన కళ

కళ విలువ తెలిసిన

కళాకారుడు ఆరాధకుడు

ధనం కంటె

కళ గొప్పది

హృదయాలను కదిలించేది

మనసుకు ఆనందాన్నిచ్చేది

సమాజానికి

ఉపయోగపడేది

నిజమైన కళ అవుతుంది.

C.S.I. మిషన్ ఉన్నత పాఠశాల, మం॥ పరకాల, జి॥ వరంగల్లు-506 16

# విస్ఫోటనం

- మల్యాల మనోహర రావు

నిస్సందేహంగా నేడు స్పందన వివాదాస్పదమైంది
ఊహకు, హృదయానికి పెరిగే అఖాతం బట్టబయలైంది
తపన కేవలం భౌతికమై
మానవీయత అభూత కల్పనౌతోంది
వర్ణచక్రాన్ని వేగంగా త్రిప్పితే కనిపించేది శ్వేత వర్ణమే
అన్న సిద్ధాంతానికి చుక్కెదురై
భాషకు, భావుకతకు, తాత్వికతకు, దృక్పథానికి కులం రంగు పులిమి
మనం కలహించుకుంటున్నప్పుడు
నిస్సందేహంగా నేడు స్పందన వివాదాస్పదమైంది
గ్రహాంతరాళంలోకి ఎగిరి
అక్కడ ప్రాణం వుందో లేదో తెలియకపోయినా
భూగోళాన్ని ఆక్రమించి
ఇక్కడ ప్రాణం పోకుండా ఆపలేకపోయినా
ఉబికి వచ్చే ఉప్పెనల దారి మళ్ళించ లేకపోయినా
భూకంపాల్ని ఎందుకు పసిగట్టలేమో తెలియకున్నా
చింతించాల్సిన పనిలేదు కాని....
పెంచుకున్న గడ్డాల్ని-వచ్చిన బట్టతలల్ని
పట్టుకున్న కుంచెల్ని-కట్టుకున్న పంచెల్ని
వర్ణచక్రంలోకి లాగి ఇదే వర్గపోరాటం అని తిరగబడుతున్నప్పుడు
జడత్వంతోనే జగద్వితంగా నిలుచున్న బుద్ధుడిని గూర్చి
మౌఢ్యాన్ని ప్రదర్శిస్తున్నప్పుడు
నిజంగానే స్పందన వివాదాస్పదమైంది
మాట విస్ఫోటనమైంది.

ఇ.నెం.2-9-512, శ్రీనగర్ కాలనీ, వడ్డెపల్లి, జి॥ వరంగల్లు-506 370

# శుభాకాంక్షలు

- తిరునగరు జగన్మోహన్

తే.గీ. చిత్రభానూదయంబయ్యె చింతదీర
పచ్చపందిళ్ళ వాసంతి పల్లవించె
గున్న మావిన కోయిల కూతలవిగో
సుఖములను గూర్చు మీకు నీ శుభయుగాది ॥

తే.గీ. ధరణి కంపించె, నింగియు దద్దరిల్లె
మరణహోమాల వార్తలు మనసు చెదిరె
ముష్కరుల దాడి ప్రభుతనే ముంచ జూచె
విదుష కాలము చెల్లెను వెతలు దీరె ॥

తే.గీ. విదుషవత్సర మత్యంత విషమునింపె
భూమి కంపించె రైలును బుగ్గిజేసె
మాన్య బాలయోగి యకాలమరణమందె
విదుష కాలము గడచెను వెతలతో ॥

తే.గీ. ఆంధ్ర తీరాన్ని తూపాను హడలగొట్టె
చిత్రవర్షము రాయలసీమయందు
యెందరెందరు మడసిరో ఏది లెక్క
విదుష కాలము చెల్లెను వెతలు మిగిలె ॥

తే.గీ. విదుషయన చాల కోపము విస్తరింప
అరువదేండ్లకు పూర్వము వచ్చినట్టి
విదుష యింతటి ఘోరాల విదుషగాదు
వచ్చు విదుషను యూహించ వశముగాదు ॥

రిటైర్డు టీచర్, మం॥ పరకాల, జి॥ వరంగల్లు-506 164

# జీవనాదం

- డా॥ మరింగంటి యాదగిరాచార్యులు

రాతియుగం నుండి
నేటి 'జినోమ్' యుగందాక
మనిషిని మనిషి చంపుకోవటం ఓ రివాజయ్యింది
మానవత్వంతో బ్రతకటం మాని ఎన్నాళ్లో అయింది
హిరోషిమ, నాగసాకి, వియత్నాం, బోస్నియా
ఆఫ్ఘాన్, పాలస్తీనా, కాశ్మీరం, సింహళం
మానవ మారణహోమానికి నిలువెత్తు సాక్ష్యాలు
చితికిన బ్రతుకుల సజీవ చిత్రాలు
పాలుగారే పసిబుగ్గపై ఎండిన కన్నీటి చారిక
అమ్మకంట రాలుతున్న రక్తాశ్రువు
అన్నీ కోల్పోయిన అనాధల గుండెల్లో
గూడుకట్టుకున్న దైన్యం
పలకా-బలపం పట్టే చేతుల్తో
తపాకీ ఎక్కుపెట్టే దృశ్యం
పండువయసులో ఓ అండలేక
ప్రకృతిలో కలిసిపోయే జీవచ్ఛవాలు
తినటానికి తిండి లేకపోయినా
తూటాల్ని జేబులో నింపాల్సిన అరాచకపు అవసరాలు
ఇవేవీ మనల్ని కదిలించవు (?)
మనసున్న మనుషులమని
మరిచిపోయి చాన్నాళ్లయింది
దూసుకొస్తున్న యుద్ధోన్మాదం

మానవాళిని కబళించటానికి ఉరకలు వేస్తున్నది
తెల్లబోయిన శాంతి కపోతం
చిరునామా వెతుక్కుంటున్నది
బుష్ అయితేనేం-లాడెన్ అయితేనేం
మానవ మారణహోమానికి సూత్రధారులు
అమాయక జన హవనంలో పాత్రధారులు
వైషమ్యాల చాటున ఎందర్ని బలిగొందాం
ఒకరినొకరు చంపుకొని మిగిలే ఆ శూన్యంలో
ఎక్కడ అన్వేషిద్దాం !
ఎవరి కోసం జీవిద్దాం !!
వైజ్ఞానిక యుగంలో విజ్ఞత వికసించదా
ఒక్కసారి మనోనేత్రం తెరిచి
అడ్డుగోడలన్నింటిని కూల్చి
ఒకరినొకరం పోల్చుకోలేమా
కలసి జీవించటంలో
మాధుర్యం ఆస్వాదించలేమా
ప్రపంచ శాంతికి బాటలు వేయలేమా.

ఇ.నెం.4-17, గోపాలపురం, హన్మకొండ, వరంగల్లు-506 009 ఫోన్: 438683

# డబ్బు

- పల్లె నాగేశ్వర్ రావు

ప్రాణం తోస్తుంది డబ్బు
ప్రాణం తీస్తుంది జబ్బు
జబ్బును పోగొడుతుంది డబ్బు
డబ్బును పోగొడుతుంది మబ్బు

కష్టపడితే ఇష్టపడుతుంది డబ్బు
ఇష్టపడితే నష్టపెడుతుంది డబ్బు
ఉన్నవాడికి భయపడుతుంది డబ్బు
లేని వాడిని భయపెడుతుంది డబ్బు

అదుపరితో పొదుపు అవుతుంది డబ్బు
అదుపు తప్పితే కుదిపేస్తుంది డబ్బు
పాదరసంలా చేజారుతుంది డబ్బు
హాలాహలంలా చేజేరుతుంది డబ్బు

ఆత్మీయుల్నీ, అభిమానుల్నీ పెంచుతుంది డబ్బు
అనుబంధాల్నీ, అనురాగాల్నీ తెంచుతుంది డబ్బు
అధికారంలో ఉంటే అమృతాన్ని తాగిస్తుంది డబ్బు
అంధకారంలో ఉంటే విషాన్ని మ్రింగిస్తుంది డబ్బు

గ్రా॥ నేరేడుపల్లి, వయా॥ మల్లంపల్లి, జి॥ వరంగల్లు-506 349

# దాశరథి అడుగుజాడలలో...

- గుండు మధుసూదన్

వీణను మీటి, జాతి తెలివిం దగ బెంచగ గోరి, యీ తెలం
గాణము మాదటంచు నవకావ్యము వ్రాసియు తెల్గువారిలో
ప్రాణమునింపి, 'దాశరథి' పాటులవెన్నియొ పొంది, తెల్గు మా
గాణమునందు క్రొత్త మొలకల్ మొలిపించెను దేశభక్తితో !

నిన్నటి ఆంధ్రరాష్ట్రమును నిర్మితి జేసినవారె మా తెనుం
గన్నలు కోరినట్టి తెలగాణను స్వార్థవిమోహ బుద్ధులై
అన్నునుమిన్ను గానక మహాంధ్ర కవుంగిలి జేర్చ, నేడు మూ
డున్నర కోట్ల తెన్గులకు డొక్కలు గాలె స్వరాష్ట్రహీనతన్ !

ఆలనపాలనన్ మఱచి ఆంధ్రప్రదేశపు మంత్రులెందఱో
కాలము బుచ్చుచుండ తెలగాణము వెన్కబడెన్ గదా ! విప
త్కాలము దాపురించె ! సరదాలను మాని తెనుంగులార ! యీ
నేలయు నింగియున్ మొరయ నిక్కపు భక్తిని చాటి వెల్గుడీ !

అదిగదిగో తెనుంగు జనులాకసమంత విశాల చిత్తులై
పదపదమంచు మీ యెదను భక్తి సుమాలను పాదు కొల్పెడిన్
ముదమోనగూడు కైతలతొ, పొంగులు వాఱు ప్రయత్నయుక్తితో
పదములు పాడి పిల్చిరికపై గెలువన్ తెలగాణ రాష్ట్రమున్ !

నాయక ముఖ్యులెందఱో ప్రణాళికలన్ రచియించి, రాష్ట్రమున్
న్యాయపథాన వేగముగ నందగనెంచి, సభల్ విరాజిలన్
జేయు వచో విజృంభణ విశిష్టతలన్ వెలయించి, తెల్గులన్
వేయి విధాల నాదుకొన వేచియునుండిరి రండు రండికన్ !

"నా తెలగాణ కోటి రతనమ్ముల వీణ" యటంచు బల్కి, తా
నేతగ నుండి, పోరి, చెఱనిల్చి, "నిజాము పిశాచమా ! మహా
భూతమ !" యంచు బిల్చి, మన పూర్వపు తెల్గుల విల్వబెంచు ధీ
దాతయు శక్తియుక్తుడగు దాశరథే మన మార్గదర్శియౌ !

ఇ.నెం.10-9-168, రామావారి వీధి, వరంగల్లు-506 002 ఫోన్: 530873

# మా వూరు

- అన్నవరం దేవేందర్

మొనపోయిన గడ్డపార, మొండి కొడవండ్లు
కాకదిన్న కర్రుమీద దెబ్బలే దెబ్బలు
కమ్మరోల్ల వాకిట్ల కాల్చిన బొగ్గుల వాసన లేదు
కొలిమిల మంటల్లేక కూర్వాట్ల పడుతున్న కమ్మరి అంజయ్య.

* * *

ఎలుగటి నాగలి చెక్కే పెద్ద బాడిష అటుకెక్కింది
పెద్ద కచ్చం నొగలు చేసే జిట్రేగు కర్రేది ?
గొర్రు, గుంటుకలు, బండి గీరెలు చేపిచ్చుడే మరిచిండ్రు
ట్రాక్టర్లు, మిషన్లు ఊరు నిండినయి
వడ్ల మల్లయ్య వాకిట్ల చెట్లు మొలిచినయి.

* * *

కిర్రు చెప్పల జాగలోన 'బాటా' చేరింది
దండెడు పేనుడు, తొండం ముడుసుడు చరిత్రలోనే మిగిలింది
పరిగెలేరుడు ఎట్టి బతుకే మాదిగ రామయ్యకు మిగిలింది.

* * *

ఊరు ఊరంతా ఇంపు సొంపుగా లేదు
ఇరిగిపోయిన పెంట పొనుక, తూట్లుపడ్డ వడ్ల బోరెం
కూలిపోయిన పిడికెల కచ్చె-చెదలు పట్టిన పాత గుమ్మి
పగిలిపోయిన కూరాడి కుండ-పనికిరాని ఉపకారి
అరిగిపోయిన ఇసుర్రాయి-ఎండిపోయిన శాదబాయిలు
మోట బొక్కెనకెల్లి పదాలు రాలె రోజులు పాయె
ఊర చెర్ల సర్కారు తుమ్మలు లేచినయి
ఎండిపోయిన మైసమ్మకాడి మోదుగు చెట్టు.

* * *

మొండి తుమ్మలు, మొండి తుమ్మలు, మొండి తుమ్మలు,
ఇగుర్లు లేని చింత చెట్లు-పడావు పడ్డ పటేండ్ల పెరండ్లు
ఊర్లె బతుకులన్ని ఎండి ఎరగప్ప అయినయి
బొండిగెల జీవునం తకపెకలాడుతుంది.

ఇ.నెం.17-4/5, టీచర్స్ కాలనీ, హుస్నాబాద్-505 467 జి॥ కరీంనగర్. ఫోన్: 55433

# చిత్రభాను గీతిక

- భట్టర్ నర్సింహాచార్య

ఆమని కోయిల పాటలతో
ప్రకృతి కన్నె సోయగాలతో
భావి ఆశల జీవన జ్యోతులతో
కలిసి పయనిద్దాం చిత్రభానుతో

గత వత్సర చేదు రుచులతో
నవ్య వత్సర షడ్రుచులతో
సమ్మిళిత జీవన పోరాటంతో
మనుగడ సాగిద్దాం మానవత్వంతో

మావి చిగుళ్ళు తిన్న కోయిల
సుస్వరమే పలుకుతుంది
పసి బుగ్గల చిన్నారుల
లేనగపు మమతనే పంచుతుంది

ఆధునికత పేర చిగుళ్ళపై
రసాయనాలను చిమ్మకు
లేబ్రాయపు మనసులపై
మత మౌఢ్యాలను కమ్మకు

శుక, పికముల భావ గీతం
చిత్రభాను వత్సరానికి స్వాగతం
సుఖ సంతోషాల ఈప్సితం
మానవ సమాజ మనోగతం.

ఇ.నెం.1-7-310, రెవిన్యూ కాలనీ, సుబేదారి, హన్మకొండ, జి॥ వరంగల్లు-506 010

# జీతం-జీవితం

- కొమర్రాజు రామలక్ష్మి

ప్రతి నెలా వచ్చేదే అయినా
ఎప్పటికప్పుడు నీ కోసం
నా నిరీక్షణ
అదనంగా ఏదయినా
తెస్తావేమోననే ఆశ
కోరికలను చంపుకోలేని బలహీనత
బాధ్యతలను నిర్వర్తించాల్సిన అవశ్యకత
నీవొస్తావంటే ఏదో ఉత్సాహం
తీరా ఒచ్చాక అంతా నిరుత్సాహం
అయినా నీ కోసం
ఎదురు చూడడంలో నాకానందం
నీ మీద నమ్మకంతో
ముందుగానే చేపట్టే పనులు
చెల్లించాల్సిన వాయిదాలు
అడపాదడపా వచ్చే
ఆకస్మిక వ్యయాలు
పోటీ ప్రపంచంలో తట్టుకొని నిలబడాలనే ఆరాటం
భవిష్యత్తు కోసం వర్తమానంతో పోరాటం
ఇంతకూ నేనెవరినో తెలుసా !
జీవితం కోసం జీతంకాక
జీతం కోసం జీవిస్తున్న
మధ్య తరగతి సగటు మానవుడిని.

ఇ.నెం.5-10-84, కిషన్‌పుర, హన్మకొండ, జి॥ వరంగల్లు-506 001

# ఆధునిక ఆది మానవుడు

- జి. ప్రభాకరస్వామి

సినారె రాసినా-సిరానే పొర్లినా

గద్దరే పాడినా-గజ్జె మోగినా

జియర్‌స్వామి ఉపదేశించినా-జయధ్వానాలే మ్రోగినా

మనకు ఫరకేంబడదు

అంశం ఏదైనా

సారాంశం ఎట్టిదైనా

పఠనకేగాని పాటించడానికా ?

ఇంతెందుకు

హిట్ కొట్టు

నెట్ కట్టు

ఆఫ్టరాల్ ఒక దోమ

ఏమైన ఫాలో అవుతున్నదా

అంతా బేఖాతర్ చేసి

రక్తం తాగడం లేదా

మరి, ఈ చరాచర ప్రపంచంలో

సమస్త ప్రాణులకెల్ల

మనిషి

ఎన్నో.... ఓ.... ఓ......

రెట్లు గొప్ప కదా !

ఇ.నెం.5-8-186, కిషన్‌పుర, హన్మకొండ, వరంగల్లు. ఫోన్: 571766

# చరిత్ర క్షమించని నేరం

- నెల్లుట్ల రమాదేవి

ఈ తప్పకి చరిత్ర మనల్ని క్షమించదు
ఈ దారుణాన్ని ధరిత్రి ఇక సహించదు
మానవత్వాన్ని పరిహసిస్తున్న ఈ నేలని
మరిక ఏ దేవతా కరుణించదు
ముక్కుపచ్చలారని ముద్దు బిడ్డల్ని
విపణి వీథిలో వస్తువుల్ని చేసినందుకు
తొలి కాన్పులో ఆడపిల్లని కనడం
తీరని నేరమయిన సమాజాన్ని నిర్మించుకున్నందుకు
చనుబాలనీ, చందమామనీ
గోరుముద్దల్నీ, గోముగా లాలించే అమ్మ ఒడినీ
పాలు మరవని పాలబుగ్గల పసివాళ్ళకి
దూరం చేసినందుకూ-
ఈ తప్పకి చరిత్ర మనల్ని క్షమించదు
ఈ దారుణాన్ని ధరిత్రి ఇక సహించదు-
ప్రపంచం కళ్ళు కప్పి
కళ్ళు తెరవని పసికూనల సాక్షిగా
పసిడి కాసులు దోచినందుకూ
గుప్పిట్లో చట్టాన్ని పెట్టుకుని
గుప్పిళ్ళింకా తెరవని చిన్నారులను
గుట్టుచప్పుడు కాకుండా దేశం దాటించినందుకూ
అమాయక గిరిజనుల మూఢాచారాలు
అధిక శాతం జనుల అవకాశాలయినందుకూ

చరిత్ర మనల్ని క్షమించదు-
కనుముక్కు తీరు బాగుండడమే
కరుణించలేని అపరాధమయినందుకూ
కనీసవసరాల కోసం, కాసుల కోసం
కన్నపిల్లల్ని అమ్ముకునే తల్లిదండ్రులున్నందకూ
పారాడే పాలబుగ్గల పిల్లలు
పాశవిక ప్రపంచపు క్రీడలో పావులవుతున్నారో,
పరిశోధనలకు పరికరాలవుతున్నారో,
పడుపు వృత్తికోసం పెంచబడుతున్న
మాంసపు ముద్దలవుతున్నారో
తెలియక స్తబ్దుగా జీవిస్తున్న
స్పందన లేని ఈ సమాజపు సభ్యులమైనందుకూ
ఇక ఏ చరిత్రా మనల్ని క్షమించదు
ఈ ధరిత్రి ఇక మనల్ని సహించదు.

# పాపం శమించుగాక !

- మొహమ్మద్ నవాజ్‌అలీ

నన్ను చూచిన వారంతా

'అచ్చు మేనమామ పోలిక' అంటున్నారు

మిసిమిలోగాని, రసికతలోగాని నిన్ను పోలను.

పగలనక-రేయనక-ఎండనక-వాననక

కండలు కరిగేలా కష్టించినా

కష్టాలను, నష్టాలను-మృష్టాన్నంగా భుజిస్తున్న నాలో

మిసిమి ఏనాడో వసివాడిపోయింది-రసికత నసి చెడింది

ఒక్క జీవన సరళిలోనే మన సామ్యం !

అర్కుడి కాంతిని నీవు అరువు తెచ్చుకున్నట్లే

అప్పుచేసి పప్పకూడు కుడుస్తున్నాను

అందుకే మాసంలో రెండవ పక్షం నీకు కృష్ణ పక్షం

నాకీ క్షణం శుక్ల పక్షం; మరు క్షణం కృష్ణ పక్షం

అప్పులను తీర్చాలన్న బెడదలేని అదృష్టశాలివి

ఐనా-ఊరకనే తీసికోవలసి వస్తున్నందుకు

నిర్వచించ లేనంతగా నీవు పడుతున్న బాధకు ప్రతీకగా

నీలో నిలిచిన కళంకాన్ని చూస్తుంటే

నానాటికి పెరుగుతున్న నా ఋణాలు-కబంధ హస్తాలై

ఎన్నో త్యాగాల ఫలితమైన దేశ స్వాతంత్ర్యాన్ని

కబళిస్తాయేమోనని కలుగుతూంది శంక.

పాపం శమించుగాక ! ఓ శశాంకా !!

ఇ.నెం.8-22, నేతాజీ వీధి, నర్సంపేట-506 132 జి॥ వరంగల్లు. ఫోన్: 32586

# “శ్రీలేఖ సాహితి, వరంగల్లు”వారు నిర్వహించిన కొన్ని కార్యక్రమాలు

| వ. సం. | తేది | వేదిక | సభాధ్యక్షులు | ముఖ్యఅతిథి | అంశము-ఉపన్యాసకులు |
|---|---|---|---|---|---|
| 1 | 28-12-1986 | టీచర్ ట్రేనింగ్ ఇన్‌స్టిట్యూట్, హన్మకొండ | శ్రీ K.S.R.G. ప్రసాద్ | శ్రీపోతుకూచి సాంబశివరావు | డా॥ వీరాచారి, తోట వేంకటేశ్వరరావుల “పసిడి మొగ్గలు” కవితా సంకలనం ఆవిష్కరణ యం. సుబ్బారావు, శ్రీవీణ, పల్లె సీను |
| 2 | 21-02-1988 | ప్ర. ప్రాంతీయ గ్రంథాలయం, వరంగల్లు | డా॥ ఐ. కిషన్‌రావు | శ్రీదేవులపల్లి రామానుజరావు | “జన్మభూమి సిరులు” ఆవిష్కరణ అక్కిరాజు జనార్ధనరావు, యం. సుబ్బారావు, వక్కంతుల అప్పారావు, గులాంనబి |
| 3 | 18-11-1988 | జిల్లా కేంద్ర గ్రంథాలయము, హన్మకొండ | డా॥ ఐ. కిషన్‌రావు | శ్రీ టి.వి. సుబ్బారావు | యల్. వేణుగోపాలరావు గారి “జీవనరాగాలు” ఆవిష్కరణ - పల్లె సీను, వి. వీరాచారి, రజిత, సందినేని రవీందర్, ఎ. విద్యాదేవి |
| 4 | 11-02-1989 | ” | శ్రీ K.S.R.G. ప్రసాద్ | శ్రీకాళోజి రామేశ్వరరావు | “ఏకశిల వైతాళికులు-1” - దాశరథి-పల్లె సీను, కాళోజి-యం. సుబ్బారావు |
| 5 | 05-03-1989 | ” | శ్రీ K.S.R.G. ప్రసాద్ | శ్రీమతి జి. సువర్ణారాణి, IAS | “ఏకశిల వైతాళికులు-2” చిలకమర్తి-యం. వరదాచార్యులు పాములపర్తి సదాశివరావు-పల్లేరు వీరస్వామి “కవితాఝరి”-కుందారపు పద్మావతి |

| వ. సం. | తేది | వేదిక | సభాధ్యక్షులు | ముఖ్యఅతిథి | అంశము-ఉపన్యాసకులు |
|---|---|---|---|---|---|
| 6 | 08-04-1989 | జిల్లా కేంద్ర గ్రంథాలయము, హన్మకొండ | డా॥ బెజవాడ కోటివీరాచారి | వేముగంటి నరసింహాచార్యులు, సిద్ధిపేట | "ఏకశిల వైతాళికులు-3" |
| | | | | | వానమామలై-డా॥ ఐ. కిషన్‌రావు |
| | | | | | అనుముల క్రిష్ణమూర్తి-ఎ. రాజేంద్రప్రసాద్ |
| | | ,, | ప్రా॥ పి. రామయ్య | పి. మోహన్, విజయనగరం | "శుక్ల" కవితా సంకలనం ఆవిష్కరణ-టి.వి.సుబ్బారావు |
| | | | | | 'శుక్ల' కవుల కవితాగానం |
| 7 | 13-05-1989 | ,, | డా॥ చిలువేరు కృష్ణమూర్తి | | "ఏకశిల వైతాళికులు-4" |
| | | | | | డా॥ పల్లా దుర్గయ్య-టి. ఉదయవర్లు |
| | | | | | డా॥ పి.వి. రమణ-వడ్డేపల్లి సుధాకర్ |
| | | | | | "కవితాఝరి"-యన్. సత్యభామ, మహ్మద్‌నవాజ్‌అలీ |
| 8 | 10-06-1989 | ,, | శ్రీభండారు అంకయ్య | శ్రీబండారు సదాశివరావు | "ఏకశిల వైతాళికులు-5" |
| | | | | | దేవులపల్లి రామానుజరావు-టి. శ్రీరంగస్వామి |
| | | | | | కోవెల సంపత్కుమారాచార్యులు-జి. బిక్షపతి |
| | | | | "కవితాఝరి"-టి. జితేందర్, | "సంగీత చందనం"-సుదర్శన్ |
| 9 | 08-07-1989 | ,, | శ్రీబాసిరి సాంబశివరావు | శ్రీగూడూరు నారాయణస్వామి | "ఏకశిల వైతాళికులు-6" |
| | | | | | పొట్లపల్లి రామారావు-నిధి |
| | | | | | పల్లా రామకోటార్య-డి.వి. శేషాచార్య |
| | | | | | ఆచార్య బి. రామరాజు-జి. భిక్షపతి |
| | | | | | కోవెల సుప్రసన్నాచార్యులు-డా॥ వి. వీరాచారి |
| | | ,, | డా॥ బెజవాడ కోటివీరాచారి | శ్రీ K.S.R.G. ప్రసాద్ | "వార్షికోత్సవము" |

| వ. సం. | తేది | వేదిక | సభాధ్యక్షులు | ముఖ్యఅతిథి | అంశము-ఉపన్యాసకులు |
|---|---|---|---|---|---|
| 10 | 22-10-1989 | జిల్లా కేంద్ర గ్రంథాలయము, హన్మకొండ | ప్రొ॥ కోవెల సుప్రసన్నాచార్యులు | శ్రీవి.యన్. శర్మ, IAS<br>శ్రీజి. సువర్ణారాణి, IAS | "వాల్మీకిరామాయణము-బాలకాండ"<br>కె. వెంకటశివయ్య, IAS |
| 11 | 09-12-1989 | " | శ్రీ K.S.R.G. ప్రసాద్ | శ్రీమతి ఎ. లక్ష్మీరమణ | "ఎమ్మెస్సార్-కథలు" ఆవిష్కరణ<br>కాలువ మల్లయ్య, నిధి, చందనాల సుమిత్రాదేవి |
| 12 | 25-03-1990 | " | శ్రీ K.S.R.G. ప్రసాద్ | శ్రీవేముగంటి నరసింహాచార్యులు<br>శ్రీకాళోజీ రామేశ్వరరావు<br>శ్రీఅనుముల క్రిష్ణమూర్తి<br>శ్రీA.U.R. సోమయాజులు<br>శ్రీకాళోజీ నారాయణరావు | "కవిత్వము-జాతీయత"-ముదిగొండ ఈశ్వరచరణ్<br>'వచన కవిత్వం-ఒక విహంగ దృష్టి'-తాతిరాజు<br>"ప్రమోదూత"-కవితా సంకలనం ఆవిష్కరణ<br>డా॥ ఆర్. మాధవరావు, డా॥ జి. దామోదర్<br>సాంస్కృతిక కార్యక్రమం-యువ కళా సమితి, నేరేడుపల్లి |
| 13 | 18-05-1990 | " | ఆచార్య వి. భాస్కరరావు | "సంగీత తుషారం" | గానం-జి. రాజారాం, హార్మోనియం-జి. జనార్ధన్<br>తబలా-మనోహర్ |
| 14 | 28-10-1990 | గురుకుల విద్యాలయము, ఖానాపూర్ | శ్రీయం. వెంకట్, మేనేజర్ వైశ్యా బ్యాంక్, ఖానాపూర్ | శ్రీముడుంబై వరదాచార్యులు | 'నా మాట-శతకం' ఆవిష్కరణ-ఎమ్మెస్సార్, పల్లె సీను<br>పల్లేరు వీరస్వామి, గోకా రామస్వామి<br>ఆశావాది ప్రకాశరావు |
| 15 | 29-12-1990 | జిల్లా కేంద్ర గ్రంథాలయం, హన్మకొండ | శ్రీకోవెల సుప్రసన్నాచార్యులు<br>శ్రీగట్టు ప్రసాద్‌బాబు | శ్రీA.U.R. సోమయాజులు | అష్టావధానము |

| వ. సం. | తేది | వేదిక | సభాధ్యక్షులు | ముఖ్యఅతిథి | అంశము-ఉపన్యాసకులు |
|---|---|---|---|---|---|
| 16 | 15-11-1993 | నెహ్రూ యువక కేంద్రం, హన్మకొండ | ఆచార్య బెజవాడ కోటివీరాచారి | ఆచార్య యస్.లక్ష్మణమూర్తి | "ఏకశిల వెలుగులు-1"-భండారు సదాశివరావు<br>చిలుకమారి సంజీవ,<br>'వే.న.రెడ్డి జీవితం'-బాసిరి సాంబశివరావు |
| 17 | 19-12-1993 | జిల్లా కేంద్ర గ్రంథాలయం, హన్మకొండ | శ్రీదర్భశయనం శ్రీనివాసాచార్యులు | | "ఏకశిల వెలుగులు-2"-కాళోజి రామేశ్వర రావు<br>సంధ్యా రంగారావు, మాదిరాజు రంగారావు,<br>పాతూరి రఘురామయ్య, అనిశెట్టి రజిత |
| 18 | 15-05-1994 | అశోకా కాన్ఫరెన్స్ హాల్, అశోకా హోటల్, హన్మకొండ | శ్రీఆర్. వెంకటేశ్వర్లు, AIR | శ్రీవి. వాసుదేవదీక్షితులు, సంపాదకులు, ఆంధ్రప్రభ | కాళోజి నారాయణరావు-'నేటి కవిత్వం-స్థితిగతులు'<br>కోవెల సంపత్కుమారాచార్యులు |
| 19 | 29-11-1995 | శ్రీవేంకటేశ్వర దేవాలయం, ఎక్సైజ్‌కాలనీ, హన్మకొండ | ఆచార్య నల్లాన్‌చక్రవర్తుల రఘునాథాచార్యులు | డా॥ తిరునగరి శ్రీనివాస్ | 'ఆచార్య సూక్తిముక్తావళి' పరిచయం |
| 20 | 30-12-1995 | జిల్లా కేంద్ర గ్రంథాలయం, హన్మకొండ | డా॥ పి. విశ్వనాథం | శ్రీ K.S.R.G. ప్రసాద్ | 'నేటి కవిత్వపు పోకడలు'-ఆచార్య తిరుమల |
| | | | **అష్టావధాన సప్తాహం** | | |
| 21 | 12-10-1996 | అశోకా కాన్ఫరెన్స్ హాల్, అశోకా హోటల్, హన్మకొండ | శ్రీ K.S.R.G. ప్రసాద్<br>శ్రీ సంపత్కుమారాచార్యులు | శ్రీ కె. అంబరీష్, IAS<br>శ్రీఆశావాది ప్రకాశరావు | అష్టావధాన సప్తాహం ప్రారంభం<br>గరికిపాటి నరసింహారావు-మహాసహస్రావధాని |
| 22 | 13-10-1996 | ,, | డా॥ కె. వెంకటాచార్యులు | డా॥ అయాచితం నటేశ్వరశర్మ<br>డా॥ ఐ. రంగనాధవాచస్పతి | జంటావధానము |

| వ. సం. | తేది | వేదిక | సభాధ్యక్షులు | ముఖ్యఅతిథి | అంశము-ఉపన్యాసకులు |
|---|---|---|---|---|---|
| 23 | 14-10-1996 | అశోకా కాన్ఫరెన్స్ హాల్, అశోకా హోటల్, హన్మకొండ | డా॥ యస్. లక్ష్మణమూర్తి | డా॥ గౌరీభట్ల మెట్టురామశర్మ | అష్టావధానము |
| 24 | 15-10-1996 | ,, | డా॥ కోవెల సుప్రసన్నాచార్యులు | అవధాన బాల భాస్కర శ్రీజానదుర్గా మల్లికార్జునరావు | అష్టావధానము |
| 25 | 16-10-1996 | ,, | శ్రీనివర్తి క్రిష్ణమూర్తి | శ్రీమతి యం.కె.ప్రభావతి | అష్టావధానము |
| 26 | 17-10-1996 | ,, | శ్రీరాళ్ళబండి కవితాప్రసాద్ | డా॥ ఐ. కిషన్‌రావు | అష్టావధానము |
| 27 | 18-10-1996 | ,, | శ్రీభండారు సదాశివరావు | డా॥ అందె వెంకటరాజం | అష్టావధానము |
| 28 | 18-11-1996 | జిల్లా కేంద్ర గ్రంథాలయము, హన్మకొండ | డా॥అనుమాండ్ల భూమయ్య | డా॥ పి. రామయ్య | "సినారె సాహితీ వైజయంతి"- మానవతావాదం-నందనం కృపాకర్ కొత్తపుంతలు-పల్లేరు వీరస్వామి, సినీ గేయాలు-సాహిత్య విలువలు-వి. వెంకటరామారావు |
| 29 | 01-12-1996 | ,, | డా॥ టి. శ్రీరంగస్వామి | శ్రీబాసిరి సాంబశివరావు-పదవీ | విరమణ-అభినందన సభ |
| 30 | 26-01-1997 | ,, | శ్రీ K.S.R.G. ప్రసాద్ | శ్రీసంపత్కుమారాచార్యులు | ఐతా చంద్రయ్య 'ఆడపిల్ల' నవల ఆవిష్కరణ డా॥ కాలువ మల్లయ్య, పల్లేరు వీరస్వామి |
| – | | ,, | డా॥ భక్తవత్సల రెడ్డి | | 'సినారె సాహితీ వైజయంతి'-ప్రతీకవాదం-జి. బిక్షపతి జాతీయతావాదం-డా॥ యం. యాదయ్య వాస్తవికత-కె. రామలక్ష్మి, గజల్స్ గానం-జి. జనార్ధన్ |

| వ. సం. | తేది | వేదిక | సభాధ్యక్షులు | ముఖ్యఅతిథి | అంశము-ఉపన్యాసకులు |
|---|---|---|---|---|---|
| 31 | 30-03-1997 | అశోకా కాన్ఫరెన్స్ హాల్, అశోకా హోటల్, హన్మకొండ | డా॥ సుప్రసన్నాచార్యులు | డా॥ సంపత్కుమారాచార్యులు | పల్లె సీను "మాధవ మాధుర్యం" ఆవిష్కరణ డా॥ పి. జ్యోతి, శ్రీమతి సి. వేదవతి, డా॥ టి.కె.వి. అయ్యంగార్ |
| 32 | 20-04-1997 | జిల్లా కేంద్ర గ్రంథాలయము, హన్మకొండ | డా॥ సుప్రసన్నాచార్యులు | శ్రీభూపతి గౌరీశంకర్ శ్రీమడిపెల్లి దక్షిణామూర్తి | "ఈశ్వర" కవితా సంకలనము ఆవిష్కరణ కవిసమ్మేళనము |
| 33 | 16-05-1997 | ,, | శ్రీ K.S.R.G. ప్రసాద్ | శ్రీ పి. రాజేశ్వరరావు మేనేజర్, విశాలాంధ్ర ప.హౌ. | డా॥ సంపత్కుమారాచార్యులు, బి.ఆర్.భగవాన్‌దాస్ డా॥ K.L.V. ప్రసాద్ |
| 34 | 20-07-1997 | ,, | శ్రీబాసిరి సాంబశివరావు | శ్రీమతి కె. అహల్యాదేవి | 'అశు కవితా ప్రతిభా పాటవ పోటీ' |
| 35 | 16-11-1997 | ,, | డా॥ వి. వీరాచారి | శ్రీ నవీన్ | "కథానిక సదస్సు"-మనోవిశ్లేషణ-వై. సరోజనిర్మల దళితవాదం-రహమతుల్లా, పాత్రచిత్రణ-కె. కృష్ణకుమారి స్త్రీవాదం-అనిశెట్టి రజిత |
| 36 | 20-12-1997 | ,, | శ్రీభండారు సదాశివరావు | శ్రీపబ్బతి నాగలింగం | "సుప్రసన్న సాహితీ వైజయంతి" తేజచక్రము-డా॥ ఎ. భూమయ్య అధునా-డా॥ కె.వి.యన్. రాఘవన్ పాండిచ్చేరి-పన్నెండు గీతాలు-ఐ.యస్. శాస్త్రి |

| వ. సం. | తేది | వేదిక | సభాధ్యక్షులు | ముఖ్యఅతిథి | అంశము-ఉపన్యాసకులు |
|---|---|---|---|---|---|
| 37 | 21-12-1997 | జిల్లా కేంద్ర గ్రంథాలయము, హన్మకొండ | శ్రీ S.L.N. ఆచార్య | శ్రీమతి కె. అహల్యాదేవి | పాంచాలరాయ శతకము-యం. శ్రీనివాసాచారి<br>శ్రీనిరుక్తి-డా॥ టి.కె.వి. అయ్యంగార్<br>స్తుతిప్రబంధము-పి. రఘురామయ్య<br>కన్నీటి కొలను-పల్లేరు వీరస్వామి |
| | | ,, | ఆచార్య యస్. లక్ష్మణమూర్తి | శ్రీజువ్వాడి గౌతమరావు | కృష్ణరశ్మి-డా॥ పి. జ్యోతి<br>శతాంకుర-వి. వెంకటరామారావు<br>సాహిత్య వివేచన-డా॥ టి. శ్రీరంగస్వామి<br>విశ్వనాథమార్గము-గిరిజామనోహర్‌బాబు |
| | | ,, | డా॥ఆర్. లక్ష్మణమూర్తి | శ్రీభూపతి గౌరీశంకర్ | భావుక సీమ-శంకరమంచి శ్యాంప్రసాద్<br>సహృదయ చక్రము-డా॥ సూర్యదేవర రవికుమార్<br>కృష్ణరశ్మి పద్యగానం-పల్లె కుమారస్వామి |
| 38 | 28-06-1998 | ప్రియదర్శిని ఉన్నత పాఠశాల, హన్మకొండ | డా॥హెచ్. గిరిజారాణి | శ్రీమతి కె. అహల్యాదేవి | స్త్రీలు-ప్రచార సాధనాలు-అనిశెట్టి రజిత<br>కవయిత్రుల సమ్మేళనము |
| 39 | 16-04-1999 | జిల్లా కేంద్ర గ్రంథాలయము, హన్మకొండ | శ్రీభండారు సదాశివరావు | శ్రీ సంపత్కుమారాచార్యులు | కథా కావ్యాలు-అకథా కావ్యాలు-కవితా గానం<br>నెల్లుట్ల రమాదేవి-జి. యాదగిరిరావు |
| 40 | 02-11-1999 | ,, | **"సాలూరు రాజేశ్వరరావు సంస్మరణ సభ"** | | ఆదిత్య ప్రసాద్, పి. శేషయ్యశాస్త్రి, ఐ. కిషన్‌రావు, భక్తవత్సలరెడ్డి, గుమ్మడి జనార్ధన్ |

| వ. సం. | తేది | వేదిక | సభాధ్యక్షులు | ముఖ్యఅతిథి | అంశము-ఉపన్యాసకులు |
|---|---|---|---|---|---|
| 41 | 15-11-1999 | జిల్లా కేంద్ర గ్రంధాలయము, హన్మకొండ | శ్రీ నవీన్ | ఆచార్య లక్ష్మణమూర్తి | "సాహిత్య కళా సిద్ధాంతంగా సోషలిస్టు వాస్తవికత-ఒక వివేచన"-శ్రీ K.S.R.G. ప్రసాద్ |
| 42 | 09-04-2000 | ,, | శ్రీబాసిరి సాంబశివరావు | శ్రీ సుప్రసన్నాచార్యులు | "విక్రమ" కవితా సంకలనం ఆవిష్కరణ-శీలం రాజేశం |
| 43 | 26-07-2000 | ,, | శ్రీ టి.వి. సుబ్బారావు | శ్రీమంగళగిరి ఆదిత్యప్రసాద్ | పి. రాజేశ్వరరావు అభినందన సభ |
| 44 | 30-12-2001 | ,, | శ్రీ K.S.R.G. ప్రసాద్ | శ్రీ కె.కె. మీనన్ | "శ్రీలేఖ" కథాసంకలనం ఆవిష్కరణ<br>డా॥ కాలువ మల్లయ్య, డా॥ వి. వీరాచారి<br>"అనిశెట్టి రజితకు సన్మానం" |
| 45 | 27-01-2002 | ,, | డా॥ టి. శ్రీరంగస్వామి | శ్రీబాసిరి సాంబశివరావు | దేవులపల్లి రామానుజరావుగారి సాహిత్య పరిశీలన-<br>"పొగాకు సుదర్శన్‌కు సన్మానం" |
| 46 | 08-02-2002 | ,, | డా॥ టి. శ్రీరంగస్వామి | శ్రీ ఎ. వరదారెడ్డి | యం. మహేందర్ రెడ్డి-"ఉషస్సు" ఆవిష్కరణ<br>డా॥ వి. వీరాచారి, యస్. లక్ష్మయ్య, అనిశెట్టి రజిత |
| 47 | 28-02-2002 | ,, | శ్రీ సుప్రసన్నాచార్యులు | శ్రీ పల్లేరు వీరస్వామి | "పేర్వారం జగన్నాథం సాహిత్య పరిశీలన"<br>"పి.వి. రవీంద్రనాథ్, కార్యదర్శి,<br>జిల్లా గ్రంధాలయము, అభినందన సభ" |
| 48 | 31-03-2002 | అశోకా కాన్ఫరెన్స్ హాల్<br>అశోక హోటల్, హన్మకొండ | శ్రీ సంపత్కుమారాచార్యులు<br>డా॥ టి. శ్రీరంగస్వామి | శ్రీసూర్యదేవర సుందరయ్య<br>శ్రీబాసిరి సాంబశివరావు | "దాశరథి రంగాచార్యుల సాహిత్య పరిశీలన"<br>"కాలం వెంట నడిచి వస్తున్న..." ఆవిష్కరణ<br>(నమిలికొండ అభినందన సంచిక)<br>"నమిలికొండ బాలకిషన్ రావుకు సత్కారం" |



# CHITRABHANU

*(Collection of Free Verse Poetry)*

*Edited by* **Dr. T. SRIRANGA SWAMY,** M.A., Ph.D.

**'శ్రీలేఖ సాహితి' వారు ప్రచురించిన**
**ఉగాది కవితా సంకలనాలు**




*a publication of*

**SRILEKHA SAHITHI**
**WARANGAL.**

Sri Shanthi Offset Printers, Hanamkonda. Ph. 579541